

కలియుగ కర్ణ బుడ్డా వెంగళరెడ్డి

స్వాతంత్ర్యవీర
ఉయ్యాలవాడ నరసింహారెడ్డి

కలియుగ కర్ణ
# బుడ్డా వెంగళరెడ్డి



- డా॥ కసిరెడ్డి

కసిరెడ్డి సాహితీ త్రింశతి ప్రచురణ - 17

# స్వాతంత్ర్యవీర
# ఉయ్యాలవాడ నరసింహారెడ్డి

# కలియుగ కర్ణ
# బుడ్డా వెంగళరెడ్డి

- డా॥ కసిరెడ్డి

రెడ్డి జన సంఘం

సహస్రపూర్ణ చంద్ర మహోత్సవం సందర్భంగా ప్రచురణ




ప్రచురణ
జాతీయ సాహిత్య పరిషత్
భాగ్యనగర శాఖ - ఆంధ్రప్రదేశ్

## స్వాతంత్ర్యవీర
## ఉయ్యాలవాడ నరసింహారెడ్డి

## కలియుగ కర్ణ
## బుడ్డా వెంగళరెడ్డి

- డా॥ కసిరెడ్డి

ప్రథమ ముద్రణ : 2003 మార్చి
ప్రతులు : 1000

ప్రచురణ :

రెడ్డిజన సంఘం - సహస్రపూర్ణ చంద్ర మహోత్సవం సందర్భంగా 30-3-2003

జాతీయ సాహిత్య పరిషత్
భాగ్యనగర్ శాఖ ప్రచురణ సంఖ్య : 75

ప్రతులకు :

మేనేజర్
సాహిత్య నికేతన్
3-4-852, బర్కత్‌పుర
హైదరాబాద్ - 500 027

ముద్రణ :
కర్షక్ ప్రింటర్స్
40, ఎ.పి.హెచ్
విద్యానగర్
ఫోన్ : 2761 8261

మూల్యం : రూ : 15/-



కీ.శే॥ శ్రీ కుందవరం మోహన్ రెడ్డి గారి స్మృత్యర్థం
నిర్యాణం : 2002 సెప్టెంబర్ 18

## స్మృతి అంకితం

**కీ.శే॥ శ్రీ కుందవరం మోహన్ రెడ్డి గారు**
**నిర్యాణం : 2002 సెప్టంబర్ 18**

అజలపురమను గ్రామాన అంగరంగ
వైభవములంది దాన ధర్మాలుచేసి
ప్రజల హృదయాన నాడొక రాజులాగ
వెలిగి మెలిగిన సద్గుణ విబుధుడతడు.

తన మనస్సున నిల్చి పెనగొనుభావాల
ఏనాడు దాచగా నెంచ లేదు.
తనవాక్కు పదిమంది తనియగా చెప్పగా
వెనుకుముందాడిన వేళ లేదు
తన కార్య శూరతన్ ధాత్రిలో నిలుపగా
ఎవరు కాదన్నలెక్కించలేదు
తన ప్రవర్తన చేత తన్మయం చెందినా
చెందక పోయినా చింతలేదు
సూటిగా నడచిన కార్య సుజనుడతడు
కష్టమే ఫలమన్న విశిష్టుడతడు
కుందవరవంశ కీర్తి సుగోత్రజుండు
శ్రీనివాసియె మోహన రెడ్డిబుధుడు.

ఒకరు వీరులు దాతలింకొకరు ఇందు
అట్టి సుచరితుల కథను ఆప్త స్మృతిగ
అంకిత మ్మిచ్చు చున్నాడ ఆత్మశాంతి
కలిగి విశ్వాత్మలోనిల్చి వెలుగ దలతు.

☆☆☆



## అభినందనలు

కీ.శే॥ శ్రీ కుందవరం మోహన్ రెడ్డి గారి స్మృత్యంకితంగా ఈ రెండు చారిత్రక కథలు (నవలికలు) ప్రచురింపబడ్డాయి. వారి స్మృత్యంకితంగా అక్షరాభిషేకం చేయాలని ఆశించిన వారు వారి పుత్రులు డా॥ కె. నరసింహారెడ్డి గారు; వారికి నా అభినందనలు.వారు, వారి శ్రీమతి డా॥సాధనగారు ఇదివరకే నా నూరు చిన్నకథలు స్వీకరించారు. ఆ పుస్తకం రెండేళ్లలో నాలుగు సార్లు ప్రచురింపబడింది. ఈ గ్రంథం కూడా అదే విధంగా పదిమంది ఆదరణకు నోచుకొంటుందని భావిస్తున్నాను.

ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామానికి పదేళ్ళ ముందే బ్రిటీష్ వారిని హడలకొట్టిన మహావీరుడు ఉయ్యాలవాడ నరసింహారెడ్డి. ఆ నరసింహారెడ్డి చరిత్ర ఈ విధంగా ప్రచురింపబడడానికి ఈ డా॥ నరసింహారెడ్డి గారు తమ పితృపాదుల స్మృతికి గుర్తుగా వెలువరించాలని సంకల్పించడం ఇది యాదృచ్ఛికంగా జరిగిందే. కొన్ని ఈ విధంగా జరగాలని మొదటే వ్రాసి పెట్టబడి ఉంటుంది. అందువల్ల ఈ నవలిక అధ్యయనం చేసే వారికి మార్గదర్శనం చేస్తుందని ఆశిస్తున్నాను.

ఈ రెండు కథలను పరిచయాత్మకంగా అందించే ఈ ప్రయత్నానికి ప్రొ॥ తంగిరాల వేంకట సుబ్బారావు గారి రేనాటి సూర్యచంద్రులు తదితర గ్రంథాలు ఆధారంగా నిలిచాయి. ఈ రచయితలందరికీ ధన్యవాదాలు.

– రచయిత

భాగ్యనగర్
**2003 మార్చి 30**

# అభినందనం

## రెడ్డి జనసంఘం

**సహస్రపూర్ణచంద్ర మహోత్సవం సందర్భంగా....**

*(Completion of One Thousand Full Moons)*



పేదవిద్యార్థి జనముల నాదుకొనుచు
వేయి పున్నాల పండుగ చేయుచున్న
రెడ్డిజనసంఘు మిట్టులే రేయి పగలు
సేవ చేయుచు సాగాలి శ్రేష్ఠముగను.

**- రచయిత**



# నివేదనం

1920వ సంవత్సరములో మద్రాసులో ప్రాదుర్భవించిన రెడ్డి జన సంఘం భాగ్యనగర్‌కు మారింది. 82 సంవత్సరాలు దాటిన సందర్భంగా సహస్రపూర్ణ చంద్ర దర్శనోత్సవం నిర్వహించుకొన్నది.

ఈ సందర్భంలో "ఏఱువాక" అనే ప్రత్యేక సంచిక వెల్వరిస్తున్నది. దానికి తోడుగా స్వాతంత్ర్య వీర, కలియుగకర్ణ గ్రంథాన్ని, రుద్రమదేవి నవలికను వెల్వరించడానికి డా. కసిరెడ్డిగారిని ప్రోత్సహించింది.

ఈ సంవత్సరం వారి సాహితీ త్రింశతి ఉత్సవం జరుగుతున్నది. వారి 30 పుస్తకములు వెల్వరించాలనే సంకల్పంతో ఇప్పటికి 16 పుస్తకాలు జాసాప-ఉత్సవ సమితి పేరిట ప్రచురించారు. ఇప్పుడుకూడా ఈ రెండు పుస్తకాలను ఆ సంస్థల పేరిటనే ప్రచురిస్తున్నారు. వారనుకొన్న విధంగా మిగతా పుస్తకాలు వస్తాయని ఆశిస్తున్నాం.

అందంగా ప్రచురించిన కర్షక్ ప్రింటర్స్ వారికి, హార్దికంగా సహకరించిన రెడ్డిజనసంఘం వారికి ధన్యవాదాలు.

భాగ్యనగర్
2003 మార్చి 30

సంయోజకులు
కసిరెడ్డి సాహితీ త్రింశతి

# స్వాతంత్ర్యవీర
# ఉయ్యాలవాడ నరసింహారెడ్డి

## నరసింహారెడ్డి పూర్వీకులు

రాయలసీమ ప్రాంతంలోని 'నొసము' సంస్థానాన్ని జయరామి రెడ్డి పరిపాలిస్తున్నాడు. ఈ సంస్థానం క్రింద అరవై గ్రామాలు ఉన్నాయి. వీరు పేదసాదలకు దానధర్మాలు చేస్తూ అన్ని గ్రామాల ప్రజల రక్షణ విషయంలో తగిన శ్రద్ధ తీసుకొంటూ ఉత్తమ పరిపాలకునిగా పేరు ప్రఖ్యాతులార్జించారు.

ఏదో ఒక కారణం చూపి సంస్థానాలెన్నిటినో బ్రిటీష్‌వారు స్వాధీనం చేసుకొంటున్నారు. వారి దృష్టి 'నొసము' మీద పడింది. నొసంలో కొద్ది మాత్రమే రక్షణబలముంది. ఆ బలానికి థగ్గులు పిండారీల్లాంటి వారిని నిల్వరించే శక్తి మాత్రమే ఉంది. అటువంటి పరిస్థితుల్లో బ్రిటీషు సైన్యం నొసంను ఆక్రమించాలనే ప్రయత్నం చేస్తున్నట్టు తెలిసింది.

పరిసర ప్రాంతాల్లోని, దేశంలోని ఎందరో సంస్థానాధిపతులూ, రాజులు బ్రిటీషువారి నెదిరించి తమ సంస్థానాల్లో రక్తం పారేట్టు చేయడం కంటే సంధే ముఖ్యమని భావించి ఏవేవో ఒడంబడికలు చేసుకొని తమ రాజరికం కాపాడుకొంటున్నారు.



జయరామిరెడ్డి ఈ విషయాలన్నీ తెలుసుకొని, ఆయుధ సమీకరణం, యుద్ధం సాధ్యం కాదని నిర్ణయించుకొని బ్రిటీషువారిచ్చే 'తవర్జీకి' (వార్షికభృతికి) అంగీకరించారు. ఇష్టం లేకున్నా ప్రజాసంక్షేమం దృష్ట్యా ఈ పద్ధతికి ఒడంబడక తప్పలేదు.

వయసు మీద పడుతున్నది. తనకు పుత్రసంతానం లేదు. అందువల్ల తన కూతురు కొడుకు తన మనుమడూ అయిన మజ్జరి నరసింహారెడ్డిని దత్తు తీసుకొన్నాడు. భవిష్యత్తులో రాయలసీమ స్వాతంత్ర్య వీరునిగా, రేనాటి సింహంగా, రేనాటి సూర్యునిగా, స్వాతంత్ర్య వీర ఉయ్యాలవాడ నరసింహారెడ్డిగా పేరు ప్రఖ్యాతులు సంపాదించుకొన్నది జయరామిరెడ్డి దౌహిత్రుడైన ఈ నరసింహారెడ్డియే.

## నరసింహారెడ్డి చదువు సంధ్యలు

రేనాటి సీమలో కుందేఱు చిన్న నది. ఆ నదికి పడమట రూపనగుడి అనే గ్రామముంది. నరసింహారెడ్డి అక్కడే జన్మించాడు. ఆ ఊరికి తూరుపుదిక్కున ఉయ్యాలవాడకు రావడం జరిగింది. అక్కడికి దగ్గరే గుళ్ళదుర్తి అనే ఊరుంది. అక్కడకూడా వీరి తల్లిదండ్రులకు ఒక ఇల్లుండేది. అందువల్ల నరసింహారెడ్డి బాల్యం మొదట రూపనగుడిలో తర్వాత ఉయ్యాలవాడ-గుళ్ళదుర్తి గ్రామాలలో గడచిపోయింది. అయితే ఎక్కువగా ఉయ్యాలవాడలో ఉన్నందువల్ల ఆ పేరే ఇంటిపేరన్నంతగా నిలిచిపోయింది. మజ్జరి అనే పేరు మరుగునపడింది.

చిన్నతనంలోనే ఆటపాటల్లో అందరికన్నా ముందుండేవాడు. ఆయాగ్రామాలలోని అయ్యవార్ల దగ్గర చదువుకొన్నాడు.

చదువుల్లో ఎదుగుతూ, అన్ని విద్యల్లో ఆరితేరుతూ, ఆజానుబాహుడై ఎదుగుతున్న తన మనుమడు నరసింహారెడ్డిని తన తర్వాత వారసునిగా ప్రకటిస్తూ జయరామిరెడ్డి దత్తు తీసుకొన్నాడు.

## నరసింహారెడ్డి వ్యక్తిత్వం

సాము గరిడీల్లో ఆరితేరిన నరసింహారెడ్డి పుక్కిటబట్టి ఊదిన గులకరాళ్ళు తగిలి చెట్టుమీది పిట్టలు క్రిందపడేవి. నెత్తిన కాషాయవర్ణ సుశోభితమైన పట్టురుమాలు, ఫాలభాగం మీద దీటైన వైష్ణవ నామం, సుదీర్ఘ ధవళనేత్రాలు, నిమ్మకాయలు నిలిచే గుబురు మీసాలు, చేత శత్రుమస్తక విచ్ఛేదనార్థమై సర్వథా సంసిద్ధమై ఉన్నట్లు కనుపించే ఖడ్గం, ముఖంపై అపూర్వకాంతి ఇదీ . . . ఆయన రూపం. కొట్టవచ్చే నిండైన విగ్రహం. ఆయనలోని దీక్ష పనివేగం చూసేవారికి ఆయనొక మహోదాత్తవీరునిగా కనిపించేవాడు. ఆయనతో సాన్నిహిత్యంగా మెలగిన వారికి పరమశాంత మూర్తిగా కనిపించేవారు. శత్రువుకు శివుడు ; తనను ఆశ్రయించినవారికి కల్పవృక్షం.

తనను దర్శించడానికి వచ్చిన పండితులతో కవులతో కవితాగోష్ఠి నిర్వహించే సాహితీప్రియుడు నరసింహారెడ్డి. కృష్ణపాడు నివాసి అయిన వెంకట సుబ్బయ్య పంతులు రెడ్డితో కళాతత్త్వ విషయాలు మాటాడే



వారు. ఓబులాచార్యులు సంస్కృతాంధ్రాలు నేర్పిన సాహిత్యగురువు. గుఱ్ఱమెక్కి ఖడ్గం చేత బట్టి ప్రజల కాత్మ బంధువుగా మంచి చెడ్డల నరసికొంటూ అందరినీ పలకరించి తోడ్పడే ఆర్తత్రాయణుడన్న పేరు ఆయనకున్నది. ఆంగ్లేయుల దౌష్ట్యాలకు ఆగ్రహం చెందుతున్నా, కాలం కొరకు ఎదురుచూస్తున్నాడు.

## మూర్తీభవించిన సాభిమానం

తన తాతగారి చివరి దశలో ఏటేటా ఇచ్చే ప్రస్తుత నొసము కోట అధిపతి అయిన నర్సింహారెడ్డికీ వస్తుంది. ఒకసారి భరణం ఇచ్చే తహసిల్దారు తలబిరుసుగా మాటాడితే జాగ్రత్త అని హెచ్చరించాడు. ఇక అతని ముఖం చూడననుకొని భరణం నిమిత్తం తన ఉద్యోగిని పంపించాడు.

తనను హెచ్చరించిన ఉయ్యాలవాడ నరసింహారెడ్డిని ఎలాగైనా అవమానించాలని నిశ్చయించుకొన్నాడు తహసిల్దార్. అందుకే వచ్చిన కర్మచారితో ఇలా అన్నాడు.

"అతనే ఒకరి క్రింద దాసరి" ఆ దాసరికి క్రింద మరోదాసరా! ఆ దాసరే వచ్చి మమ్మల్ని అడిగితే భరణం ఇస్తాం" అంటూ వెకిలిగా నవ్వాడు.

## రెడ్డి ప్రతిజ్ఞ

ఆ మాటలున్నవి ఉన్నట్లుగా విశ్వాసపాత్రుడైన ఆ కర్మచారి నర్సింహారెడ్డికి చెప్పాడు. రెడ్డి ఆ అధికార దుర్మధాంధుణ్ణి సంహరిస్తానని ప్రతిజ్ఞ చేసాడు. భారతీయుల స్వాతంత్ర్యాన్ని హరించి పిడికెడంత మంది అధికారం చలాయించడం ఎలా నిరోధించాలి అని మొదటినుండి రెడ్డి ఆలోచిస్తూనే ఉన్నాడు. తన తాతగారు భరణానికి ఒప్పుకోవడం వల్ల కూడా మరీ చులకనైపోయాం అని ఆయన భావించారు. ఆ తహసిల్దారును సంహరించేవరకు భోజనం కూడా ముట్టనని ప్రతిజ్ఞ చేశాడు.

తాను చేసిన ఈ ప్రతిజ్ఞతో వాడు చావడం ఖాయం. కానీ ఆ తర్వాత బ్రిటీషు సైన్యం రంగంలోకి దిగుతుంది. దిగనీ ఎదిరిస్తాను, తాను ఈ పిచ్చిభరణం నుండి విముక్తి పొంది స్వేచ్ఛను పొందాలి. తనకు తన సంస్థాన ప్రజలకు స్వేచ్ఛ కావాలి. ఒకవేళ తాననుకొన్న విధంగా ఎవరిసాయం లభించకపోవచ్చు. అయినా ప్రజల్లో ఒక సంచలనం కలుగుతుంది. స్వాతంత్ర్యభావ బీజాలు నాటబడతాయి. తన తిరుగుబాటు వల్ల ప్రజల్లో ధైర్యం వస్తుంది.

## తహసిల్దార్ వధ

దగ్గరనే ఉన్న కలపటాల గ్రామానికి కబురంపాడు. అక్కడ ఉన్న రెండు వందల బోయల దండు రెడ్డికి సహకరించడానికి వచ్చింది.



నరసింహారెడ్డి ఏపని అయినా చెప్పేచేస్తాడు. తహసిల్దార్‌కు ఈ విధంగా చెప్పాడు.

“ఒరే! నీవు నిజమే పలికావు ; ఎందుకంటే నేను దాసరినే ; నరసింహస్వామికి నేను దాసరినే. నీకు మాత్రం యముణ్ణి గుర్తుంచుకో రేపే నీదగ్గరికి వస్తున్నా!”

ఇదవరకు మా పెద్దలు చేసుకొన్న ఒప్పందం మర్యాదను నేను పాటించాను. ఇక నేను పాటించను. నేనిక కోశాగారాన్నే కొల్లగొడతాను. అడ్డం వచ్చినవారిని అడ్డంగా నరికేస్తాను.

ఒడ్డె ఓబన్న తనకు అంగరక్షకునిగా నిలవగా కోవెలకుంట వైపుగా దండు నడిపించాడు నరసింహారెడ్డి. కోబలి అని బొబ్బలు పెడుతూ నగరంలో ప్రవేశించారు. దండు వస్తుందని గ్రామస్తులనేక విధాలుగా భయపడ్డారు. తాహసిల్దార్‌ను తిట్టుకొన్నారు. ఎందరో ఊరు వదలి వెళ్ళిపోయారు.

తహసిల్దారు దగ్గర కొంత మంది భటులున్నారు. వారితో ఎదిరించాలనే అతడు నిర్ణయించుకొన్నాడు. కాని రెడ్డి బలాన్ని చూచి అక్కడి భటులందరు ఆయుధాలు పారవేసి పారిపోయారు. తహసిల్దార్ భయపడి ప్రభుత్వ కార్యాలయంగా వాడుతున్న ఒక ఇంటిలోకి వెళ్ళి తలుపులు వేసుకొని దాక్కున్నాడు. మొత్తం కోయిలకుంట ఇల్లిల్లు గాలింపు ప్రారంభమయింది. స్త్రీల విషయంలో అమర్యాదగా ప్రవర్తించ

రాదని, ఒకరి వస్తువులను తాకరాదని ఒక్క తహసిల్దారునే పట్టుకోవాలని సైన్యానికి ఆదేశాలు జారీచేశారు రెడ్డి.

చివరకు నరసింహారెడ్డి, ఒడ్డె ఓబన్నల చేతికి చిక్కడం జరిగింది. తహసిల్దారు దాగి ఉన్న ఇంటి తలుపులు ఒక్కగ్రుద్దుకే పగులగొట్టి లోనున్న అతణ్ణి పట్టుకొన్నాడు రెడ్డి. బ్రిటీషువారి తొత్తువై హిందువులను అవమానిస్తున్న నీకిదే శిక్ష అనుభవించమంటూ తహసిల్దార్ తలను నరికివేశాడు ఉయ్యాలవాడ నరసింహారెడ్డి.

## బొందిలి నారసింగ్ వధ

అక్కడినుండి కోశాగారంవైపుగా వచ్చాడు. కాపలాదారులందరు పారిపోయారు. కాని బొందిలి నారసింగ్ అనే విశ్వాసపాత్రుడొకడు ఖజానాను రక్షిస్తున్నాడు.

"నీవు బ్రిటీషువారి ఉద్యోగివి. వారికి ఊడిగం చేయడం బాని సత్వం. నేను ఆంగ్లేయులను ఎదిరించి ఈ దేశం నుండి పంపించాలనే నిర్ణయించుకొన్నాను. నీకు ఉద్యోగమే కావలసివస్తే నా సైన్యంలో చేరిపో..." అన్నాడు నరసింహారెడ్డి.

కాని నారసింగ్ తనకు దేశభక్తి ఉందనీ, తమ పూర్వీకులు బుందేల్‌ఖండ్ నివాసులనీ, వారు ఏ ప్రభువు దగ్గర చేరినా అతడు స్వదేశీగానీ, విదేశీగాని తమ ప్రభువుకు ద్రోహం చేయరనీ, తన బొందిలో ప్రాణమున్నంత వరకు కోశాగారంలోనికి రావడానికి వీల్లేదని ఖచ్చితంగా



అన్నాడు. అతని చేతిలోని తుపాకీని నరసింహారెడ్డి పట్టుకొని లాగగా కాల్చివేసే ప్రయత్నం చేశాడు. రెడ్డికి అంగరక్షకునిగా ఉన్న ఒడ్డె ఓబన్న వెంటనే నారసింగ్ తల నరికి వేశాడు.

ఆ తర్వాత ఆ ప్రభుభక్తి పరాయణుడు తన సైన్యంలో ఉండవలసినవాడని నరసింహారెడ్డి పరిపరి విధాల చింతించాడు. ఆ తర్వాత కోశాగారమంతా కొల్లగొట్టి, తహసిల్దార్ శిరస్సును ఊరిలో ఊరేగింపు తీయించి, రంగనాయకస్వామిని పూజించి, పేదలకు ధానధర్మాలు చేసి నొసంకోట వైపుగా పయనమయ్యాడు నరసింహారెడ్డి.

## భారతీయ సైనికులకు క్షమాభిక్ష

కోవెలకుంట్ల (ఆ రోజుల్లో) కడప మండలంలో ఉన్నది. వెంటనే కడపలోని పై అధికారులకు ఈ వార్త అందింది. ఆంగ్లేయాధికారులు సమావేశమయ్యారు. వెంటనే నరసింహారెడ్డిని అణచివేయాలని నిశ్చయించారు. తాత్సారం చేస్తే మరో పదిచోట్ల ఇటువంటి ఉద్యమాలే పుట్టుకొని వస్తాయని, హిందూ దేశంలో ఒక్క ఆంగ్లేయుడు కూడా బ్రతికి బట్టకట్టడని బెంబేలు పడిపోయారు.

ఆ మండలానికి అధికారి కాక్రేన్. తన చేతిక్రింది సైన్యాధికారిని పిలిపించాడు. హైకమాండుకు తెలియజేశాడు. పైనుండి పర్మిషన్ తనకనుకూలంగానే వస్తుందని తెలుసు. వందలాది మంది రక్షక భటులను, సైనికులను సమకూర్చుకొమ్మన్నాడు. వారిని తీసుకొని ఉయ్యాల

వాడలో గాని, నొసంకోటలోగాని ఎక్కడ ఉన్నా నరసింహారెడ్డిని బంధిం చాలని ఆజ్ఞ జారీ చేశాడు.

ఓ అధికారి నేతృత్వంలో అందరు భారతీయ భటులే బయలు దేరి వెళ్ళారు. ఉయ్యాలవాడ సమీపంలో విడిదిచేశారు. రెడ్డి ఆ గ్రామం లోనే ఉన్నట్టు సమాచారమున్నది. కాని ఉయ్యాలవాడలోకి అడుగు పెట్టడానికి ఎవరికీ ధైర్యం చాలడం లేదు. గ్రామంలోని ప్రజలు కూడా ఊరు వదలి వెలుపలికి రావడం లేదు.

నరసింహారెడ్డికీ సంగతి తెలిసింది. వారి భయం అర్థమయింది. తన వారిని (ఉద్యోగార్థం ఆంగ్లేయుల సైన్యంలో ఉన్నవారిని) తానే చంపడం సమంజసం కాదనిపించింది. వారికి నచ్చజెప్పి పంపించడం గానీ, లేదా వారు ఒప్పుకొంటే తన సైన్యంలో వారిని చేర్చుకోవడం గాని చేయాలని నరసింహారెడ్డి నిశ్చయించి రెండు రోజుల తర్వాత తెల్లవారుజామున హఠాత్తుగా దాడి చేశాడు.

వారు తమ గుఱ్ఱాలను, ఆయుధాలను వదలిపెట్టి పారిపోతు న్నారు. నరసింహారెడ్డి దండులోని బోయలు వారిని తరిమి తరిమి పట్టుకొన్నారు. ఊరి నడుమ కచేరికి అందరినీ చేర్చారు. నరసింహారెడ్డిని చూస్తూనే బ్రిటీషువారి జీతగాళ్ళయిన భారతీయ భటులు వణికి పోయారు.



"వాడెవడో చెప్పినంత మాత్రాన మీరిలా బయలుదేరి రావడం మీ ఉద్యోగ ధర్మమే కావచ్చు గాక. మన వ్రేలుతో మనకన్నునే పొడిచే రాజనీతి ఈ కుటిల కిరస్తానీ దేశీయులు అవలంభిస్తున్నారు. కన్ను మనదే ; వ్రేలు మనదే. నష్టపోయేది మనమే. వాడి సొమ్ము ఎక్కడా పోదు. మీరు ఈ ఉద్యోగాలు వదలిపెట్టి మీమీ వృత్తులు చేసుకొంటూ బ్రతకండి ; ఇది మొదటి అపరాధంగా భావించి మిమ్మల్ని వదలి పెడుతున్నాం" అన్నారు ఉయ్యాలవాడ నరసింహారెడ్డి. సైనికులందరు గుఱ్ఱాలను ఆయుధాలను వదలి, కడపవైపుగా బయలుదేరి వెళ్లి పోయారు. రెడ్డి ఉయ్యాలవాడనుండి నొసం కోటవైపుగా సాగిపోయాడు.

## నరసింహారెడ్డి యుద్ధవ్యూహం

హిందూదేశం మొత్తం ఆక్రమించుకొని, కొన్ని సంస్థానాలకు పరిమిత స్వాతంత్ర్యమిచ్చి, ఎన్నిటినో తమలో కలుపుకొని పాలిస్తున్నారు బ్రిటీషువారు. వాడు హిందూ దేశానికి శత్రువు. వాడిప్పుడు ప్రభుత్వం నెఱపుతున్నాడు. చిన్న ప్రయత్నమైనా సరే తన సంస్థానం తానే ఏలాలి. తన ప్రజల పరిపాలన తానే చూచుకోవాలి.

ఇలా ఆలోచించి ఉయ్యాలవాడ సురక్షిత స్థలం కాదని పైగా ఇక్కడి ఉప్పునీళ్ళతో ఇబ్బందులు వస్తాయని, ఈ పోరాటంలో నొసం కోటనే కేంద్రంగా చేసుకోవాలని సైన్యంతో అక్కడికి వెళ్ళిపోయాడు నరసింహారెడ్డి.

ఈ యుద్ధం ఇంతటితో ఆగేదికాదు. ఏ సంధి ఒడంబడికలకు తావులేదు. బ్రిటీషువాడు తన ఆధిపత్యాన్ని ప్రశ్నించని విధంగా తానే పరిపాలించుకోవాలి. ఆ తర్వాత రేనాడు అనబడే ఈ నడిగడ్డ వైపుగానే వాడు కన్నెత్తకుండా చేయాలి.

నొసము కోటను పటిష్ఠం చేశాడు. ఆహారపదార్థాలు నిల్వ ఉండే ఏర్పాట్లు చేయించాడు. ప్రజలందరు వ్యవసాయాది వృత్తిపనులను వదలిపోకుండా ధాన్యాదుల ఉత్పత్తి పెరిగేట్టు పనిచేయాలన్నాడు.

బ్రిటీషువారిచ్చే భరణంతో కోటవరకే పరిమితమైన జీవనం గడుపుతున్నా, ఎక్కడ పంచాయితీలైనా, ఎదురుబాధల్లో ఉన్నా అక్కడ ప్రత్యక్షమై సమస్యలు పరిష్కరిస్తూ పరమ ప్రశాంతంగా కాలం గడిపే నొసం వీరుడు ఉయ్యాలవాడ నరసింహారెడ్డి జీవితాంతం పోరాడడానికే నిర్ణయం తీసుకొన్నాడు.

అందుకే ఆకుమళ్ళ గ్రామంలో ఉన్న పరమభక్తుడు అంజనం వేసి ఎక్కడేది జరుగుతుందో తెలుసుకొనే శక్తి ఉన్న అంజనసిద్ధుడు గోసాయి వెంకన్నను తన దగ్గరికి పిలిపించుకొని గూఢచార వ్యవస్థకు అతణ్ణి అధిపతిగా నియమించి, బ్రిటీషువారి కదలికలను ఎప్పటికప్పుడు తెలుసుకొని తనకు తెలియజేసే ఏర్పాట్లు చేయించాడు.

ఆ తర్వాత 'ఔకు' నగరాన్ని పరిపాలించే నారాయణరాజు దగ్గరికి వెళ్లాడు. రాజు ఆళియ రామరాయల వంశీయుడు. బుద్ధిశాలి, నీతి



విశారదుడు ; ప్రజల్లో మంచి పేరున్నవాడు. అతనితో నరసింహారెడ్డి ఇలా అన్నాడు.

"వర్తకం పేరిట వచ్చిన ఈ హూణదేశీయులు దేశాన్ని కొల్ల గొట్టారు. హిందూ రాజుల మధ్యన కలహాలు సృష్టించారు. మొత్తం దేశానికే ప్రభువులై పోయారు. వ్యాపారం నెపంతో దేశ దేశాలను ఆక్ర మించే రాజనీతి ఇది.

వారి పాలన ఎన్నేళ్ళు సాగాలి. మనం ఊరకుంటే మరో వెయ్యే ళ్ళకు కూడా మనకు స్వాతంత్ర్యం రాదు. ఈ దేశాన్ని దరిద్ర దేవత వదలి పెట్టిపోదు.

నీవు ఔకు పరిపాలకుడవు. వీర ఆళియ వంశంలో పుట్టిన వాడవు. నాతో చేయి గలుపు. ఆ విదేశీ వ్యాపార ప్రభువులను దేశం నుండి పంపించివేద్దాం" అన్నాడు నరసింహారెడ్డి. అప్పుడు నారాయణ రాజు కొంతసేపు ఆలోచించి ఇలా అన్నాడు.

"మీరన్నది సత్యమే. ఆ బ్రిటీషువారి అపారసైన్యం ముందు మనం ఒకరిద్దరం నిలవలేము. మనతోనే మన స్వాతంత్ర్యోద్యమం అంతమైపోతుంది. మనం ఇప్పుడు యుక్తినుపయోగించి స్థిరంగా నిలచి ఉండేట్టు చూచుకోవాలి. ప్రజల్లో ఉద్యమాన్ని నిర్మించాలి. మిగతా రాజులందరినీ కలుపుకోవాలి. మన ప్రయత్నాలు మనం చేయాలి. కాని ఇప్పుడు యుద్ధానికి పూనుకొంటే మనమిరువురం అంతమవుతాం. వాడు మరీ బలోపేతుడవుతాడు.... ఆలోచించు" అన్నాడు నారాయణరాజు.

"మీరు కలిసి రాకపోతే నేను ఒంటరిగానే పోరకతప్పదు" అన్నాడు రెడ్డి.

"అయితే మీ ఇష్టం. మీ సాహసాన్ని కాదనను. నా తోచినంత సహాయం చేస్తాను. ప్రస్తుతానికి ఈ ధనం తీసుకోవలసిం"దని, మర్యాద చేసి, గజ్జాలమీద ధనం మూటల కట్టించి నొసం కోటకు సాగనంపాడు నారాయణరాజు.

ఔకు రాజు విషయంలో అసంతృప్తి ఉన్నా తనకతడు ఏ విధంగా నైనా సహాయపడే మిత్రుడే అని సంతోషిస్తూ కోటకు వెళ్ళిపోయాడు నరసింహారెడ్డి.

అనేక గ్రామాల నుండి లెక్కలేనంతమంది సైన్యంలో చేరు తామని వచ్చారు. అందరినీ అక్కడక్కడ దళాలుగా పెట్టి శిక్షణ నిప్పించే ఏర్పాటు చేశాడు నరసింహారెడ్డి. తెల్లవాడు రెడ్డి పరాక్రమానికి భయపడి పోయాడని ప్రజలకర్థమై పోయింది.

అప్పటికప్పుడే రెడ్డి కీర్తిని కథలుగా గాథలుగా గేయాలుగా చెప్పుకోవడం మొదలు పెట్టారు జానపదులు.

గేయం : **రాజారావు రాజబహాదురు నారసింహారెడ్డి**
**రెడ్డికాదు బంగారపు కడ్డీ నారసింహారెడ్డి**
**ములుకోలకట్టె చేతుల ఉంటే మున్నూటికి మొనగాడు**
**కరువు వచ్చినా కాటక మొచ్చినా ఆదరించే రెడ్డి**



**రెడ్డి కోసమూ ప్రాణం పోయిన స్వర్గం వస్తుంది.**
**ఈ పొద్దిదియా, రేపు తదియరా, నరుని ప్రాణమోయి**
**నీటిమీదను బుగ్గవంటిది నరుని శరీరంబు**
**పదరా - పదరా తెల్లవారిని తెగనరుకూదాము॥**

ఊరూర ఇవే పాటలు ; పాటలు పాడుతూ ఊరూరా తిరుగు తున్నారు యువకులు. ముక్కమళ్ల, ముంగోడు, కానాల, సంజమల తదితర ప్రాంతాలనుండి పిల్లలు, యువకులు, పెద్దలు ఎందరో సైన్యంలో చేరుతామని వస్తున్నారు. తన పరిధిలోని గ్రామాలే కాదు. నడిగడ్డలోని గ్రామాలన్నిటినుండి వస్తున్నారు. అందులో పరీక్ష చేసి మెరికల్లాంటి వారినే ఏరి సైన్యంలో చేర్చుకొన్నాడు ఉయ్యాలవాడ నరసింహారెడ్డి. ఆ విధంగా మొత్తం తొమ్మిదివేల సైన్యాన్ని రెడ్డి సమ కూర్చుకొన్నాడని కొందరు, కాదు ఆరు వేలే అని కొందరు అంటున్నారు.

## తెల్లవారి వ్యూహం

మొదట భారతీయ సైనికులనే పంపడం వల్ల ఫలితం లేక పోయిందని, అన్ని స్థాయిల్లో దళపతులు తప్పనిసరిగా ఆంగ్లేయులే ఉండాలని, ప్రతిదళంలో అయిదార్గురు భారతీయులుండాలని, వారిని ముందుంచి వెనుకవైపున కిరస్తానీ సైనికులుండాలని... ఇటువంటి వ్యూహంతో నొసముకోటవైపుగా సైన్యాన్ని నడిపించారు తెల్లవారు.

ఈ సైన్యానికి "వాట్సన్" అనే యుద్ధవిద్యావిశారదుడైన ఆంగ్లే యుడు నాయకత్వం వహించాడు.

భరణాన్ని పొందుతున్న ఒక స్వదేశీ రాజు తిరుగుబాటే ఇది అని ఆంగ్లేయుల దృష్టి. మమ్ము పాలించడానికి ఈ విదేశీయులెవరనేది నరసింహారెడ్డి దృష్టి.

గూఢచర్యంలో ఆరితేరిన గోసాయి వెంకన్న తెల్లసైన్యం కదలికలను గుర్తించి నొసము కోటకు వార్త పంపించాడు. ఆ విధంగా ఆ సైన్యం కదలికలు ఎప్పటికప్పుడు రెడ్డి కందుతూనే ఉన్నాయి. లెఫ్టినెంట్ కల్నల్ వాట్సన్ ఆలోచనలను కూడా వెంకన్న పసిగడుతున్నాడు. ప్రతి వ్యూహంతో ఎలా ప్రతిఘటించాలో రెడ్డి ఆలోచిస్తున్నాడు ; ఆజ్ఞలు జారీ చేస్తున్నాడు.

## రెడ్డి ప్రతివ్యూహం

కోటచుట్టూరా ఉన్న ఆగడ్తనిండా నీరు నింపించాడు. సమీపంలోని చెరువులోని నీరు తూముల ద్వారా వాగుల్లోకి వెళ్ళేట్టు చేశాడు. దీనివల్ల శత్రువులకు నీళ్ళందకుండా చేయాలనే యత్నం. కోట గోడల మీద వడిసెల రాళ్ళతో కొట్టేవారిని నియమించాడు. ఒక్క బాణంతో శత్రువులను సంహరించే సూటి వేటు భటులను రహస్యస్థలంలో నియమించాడు. కోట గోడల కెగబ్రాకే వారిపై సలసల క్రాగి మసలుతున్న నూనె పోసేవారిని నియమించాడు. కోటగోడలపై నుండి రాళ్ళు దొర్లించే ఏర్పాటు చేశాడు. తాను స్వయంగా సైన్యాన్ని ఆదేశించే కీలక స్థానంలో నిలిచాడు. శత్రుసైన్యం సమీపంలోకి వచ్చిందని వెంకన్న తెలియజేశాడు. ఎక్కడివారక్కడ నిలిచి యుద్ధానికి సంసిద్ధులయ్యారు.



## సమరంలో ఎత్తులు పైయెత్తులు - రెడ్డి విజయం

వాట్సన్ నొసము కోట సమీపించాడు. బాణాలు, తుపాకుల గుండ్లు కురిపించారు రెడ్డి సైనికులు. కోటను సమీపించడానికి వాట్సన్ యత్నం చేస్తున్నాడు. బ్రిటీషు సైన్యం వెనుకడుగు వేసే స్థితి కల్పించాడు.

నెలరోజుల యుద్ధం జరిగింది. వైశాఖపుటెండల ధాటికి బ్రిటీషు సైన్యం తట్టుకోలేకపోయింది. కోటగోడమీద ఒకే చోట శతఘ్ని గుండ్లు కురిపించి కోటను పగల గొట్టించే యత్నం చేసి సాధ్యంకాక వెనుకడుగు వేశాడు. మందుగుండు అయిపోవడంతో బళ్ళారిలో ఉన్న యుద్ధసామగ్రి గిడ్డంగికి వార్తాహరుణ్ణి పంపించాడు.

ఈ విషయం పసిగట్టిన వెంకన్న గూఢచర్యం మెచ్చుకోదగింది. రెడ్డికి ఈ విషయం అందజేశాడు. నరసింహారెడ్డి వెంటనే ఔకు రాజుకు ఈ విషయం చేరవేశాడు. బళ్ళారివైపునుండి వస్తున్న వాట్సన్ మందుగుండును ఔకును పాలించే నారాయణరాజు దోచుకున్నాడు. ఈ విషయాన్ని భటుని ద్వారా చెప్పాడు. ఆ భటుడు నొసం కోటలోకి వెళ్ళని స్థితి ఏర్పడగా ఉత్తరాన్ని బాణానికి కట్టి కోటలోన పడేట్టు చేసి వెళ్ళిపోయాడు. సంగతి తెలిసి రెడ్డి ఔకు రాజును అనేక విధాల ప్రశంసించాడు. మనసులోనే అభినందనలు తెలుపుకున్నాడు.

మందుగుండు సామగ్రి లేని వాట్సన్‌పై దండయాత్ర చేయాల్సిందేనని నిశ్చయించి, నరసింహారెడ్డి కోట తలుపులు తీయించి

సైన్యంతో ముందుకు దూకాడు. మహా వేగంతో పరుగెత్తే గుఱ్ఱమెక్కి ఇంగ్లీషువారి సేనపై పడ్డాడు. ఎందరినో సంహరించి మధ్యందిన సూర్యుడిలా వెలిగిపోయాడు. ఆయనకు సహాయంగా బోయదండు నిలిచింది. యుద్ధరంగం పీనుగుపెంటగా మారింది. రెడ్డి శత్రువుల పాలిటి కాలరుద్రుడయ్యాడు. వీరభద్రుని అపరావతారంగా వెలిగిపోయాడు.

బ్రతికి ఉంటే బలుసాకు తినవచ్చుననుకొన్నాడు వాట్సన్. సైనికులకు ఎవరికీ ఏ మాత్రం చెప్పకుండా బళ్ళారి దిక్కుగా పారిపోయాడు. వాట్సన్ వెళ్లిపోవడంతో బ్రిటీషు సైన్యం చెల్లాచెదరైపోయింది. ఎందరో రెడ్డి కరవాలానికి బలి అయిపోయారు. బోయదండు బ్రిటీష్ సైన్యాన్ని చీల్చి చెండాడింది.

నరసింహారెడ్డి విజయోత్సవంతో నొసము కోటలో ప్రవేశించాడు. కాని, మైదాన ప్రాంతంగా ఉన్న నొసముకోట శత్రువు తొందరగా రావడానికి అనుకూలంగా ఉందని, అందువల్ల అక్కడినుండి తన నివాసం మార్చి శత్రుదుర్భేద్య స్థలంలో తానుండి విజయాలు సాధించాలని నిర్ణయించాడు ఉయ్యాలవాడ నరసింహారెడ్డి.

## నల్లమల దుర్గం నుండి పోరాటం

నొసము పూర్వ పరిపాలకులు నల్లమల అడవుల్లో ఓ కోట కట్టించారు. ఆ కోటను దినాల మీద బాగు చేయించాడు రెడ్డి. కోటలో ఏండ్ల కొలది నిల్వగా ఉండే పదార్థాలను చేర్పించాడు. బావులు



సరిచేయించాడు. పైన సరస్సుల్లో నీళ్ళు నింపించాడు. రహస్య మార్గాల ద్వారా లోనికి పదార్థాలు వచ్చే ఏర్పాట్లు చేయించాడు. పనులన్నీ శరవేగంగా జరిగిపోయాయి.

నల్లమల దుర్గానికి మకాం మార్చాడు నరసింహారెడ్డి. నల్లమల అడవులకు దగ్గరలోనే రుద్రవరం ఉంది. ఆ అడవుల మీద అధికారం చలాయించే కిరస్తానీ రేంజరొకడున్నాడు. వాడు చేసే దుష్కార్యాలకు అంతులేదు.

అరణ్యంలో ఆకులకు, పుల్లలకు కందగడ్డలకు వచ్చేవారిని పట్టుకొని కొట్టేవాడు. గుడిసెలు కప్పుకోవడానికి గడ్డికై వెళ్ళేవారి దగ్గర లంచాలు గుంజేవాడు. మేతకొరకై మేకలతో వెళ్లినవారిని దబాయించి ఆ మేకల్లో ఒకటి రెండింటిని పట్టుకొని తెచ్చి కోసుకొని తినేవాడు. పొయ్యిలోకి కట్టెపుల్లలు తెచ్చుకొందామని వెళ్ళిన స్త్రీలను బలవంతం చేసి అత్యాచారం జరిపేవాడు. మొత్తం మీద ఈ రేంజర్‌ను అందరూ రావణాసురుని క్రింద జమకట్టి తిట్టేవారు.

## రావణాసురుని వంటి రేంజర్ వధ

ఆ రేంజరును సంహరించాలని నిశ్చయించుకొని ఒడ్డె యోబన్న తాను ఇద్దరే రుద్రవరంలో ప్రవేశించారు. రేంజరు ఇంటిలో ప్రవేశించారు. రేంజర్ పారిపోయాడు. ఒక చాకలి ఇంటిలో ప్రవేశించి అతని కాళ్ళు పట్టుకొని కాపాడమన్నాడు. ఆ చాకలి, రేంజరు మీద దయతలచి తన

యింట్లో ఓ మూల కూచోబెట్టి పాత బట్టలు కప్పాడు. రెడ్డి ఆ ఇంట్లో ప్రవేశించగా తన ఇంట్లోకి రేంజర్ రాలేదని అబద్ధమాడాడు. నరసింహా రెడ్డి ఊరిలోని అందరిని గద్దించి అడుగుతూ బయలుదేరాడు. రేంజరు వల్ల తన భార్యను కోల్పోయిన ఒక వ్యక్తి చాకలి ఇంటిలోనే దాగి ఉన్నాడని చెప్పాడు.

నరసింహారెడ్డి మహావేగంతో చాకలి ఇంటిలో ప్రవేశించాడు. చాకలి మళ్ళీ అబద్ధమాడగా అతణ్ణి గద్దించి మూలనున్న రేంజర్ను లాగి అతని తప్పులన్నీ ఎత్తి చూపించి తలనరికివేశాడు రెడ్డి. ఆ తర్వాత శత్రువుకు సహకరించి ఇంటిలో పెట్టుకోవడం వల్ల మన దేశాన్ని వారు ఆక్రమించారు గుర్తుంచుకో అని చాకలిని మందలించి బయలుదేరారు రెడ్డి, ఒడ్డె యోబన్న.

ఇద్దరు అడవిలోని తమ కోటకు చేరుకొన్నారు. రావణాసురుని వంటి రేంజర్ చనిపోవడంతో రుద్రవరం ప్రజలు, ఆ చుట్టుప్రక్కల గ్రామాల ప్రజలు పండుగ జరుపుకొన్నారు ; నరసింహారెడ్డి పోరాటానికి ఉపకరిస్తాయనుకొన్న పరికరాలు, పోరాట సామగ్రి, ధనం, ధాన్యం ... అవీ ఇవీ ఎన్నో ఆయనకు కానుకగా సమర్పించుకొన్నారు. కంబం చుట్టుప్రక్కల నున్న వారు కూడా ఎన్నో కానుకలు అందజేశారు.

## కోడి పందేల్లో కుట్ర - ఎదురుదెబ్బ

కంబం తహసిల్దార్ హిందువే. అతడు ఇంగ్లీషువారితో కుమ్మక్కయ్యాడు. నరసింహారెడ్డి ఎక్కడెక్కడ తిరుగుతున్నాడో, ఏమేం



చేస్తున్నాడో ఎప్పటికప్పుడు వార్తలు పంపిస్తున్నాడు. రెడ్డి గూఢచారులు తహసిల్దారు కుటిల వర్తనను తెలుసుకొని అతణ్ణి కనిపెట్టి ఉండాల్సిందన్న వార్తను చేరవేశారు.

కంబం చుట్టుప్రక్కల వారు సంక్రాంతి సందర్భంగా కోడి పందేల నేర్పాటు చేసి నరసింహారెడ్డిని ప్రముఖంగా ఆహ్వానించారు. ఆ పందేలు చూడడానికి వచ్చిన వారికి స్వాతంత్ర్య భావాలు చెప్పవచ్చునని రెడ్డి బయలు దేరాడు.

తహసిల్దారుకీ సంగతి తెలిసింది. వెంటనే సూపరింటెండెంట్‌కు ఈ వార్త చేరవేశాడు. సూపరింటెండెంట్ బలగాలతో వచ్చిన వెంటనే వారిని తీసుకొని కోడిపందేలవైపు బయలుదేరాడు. కోడి పందేలను సూపరిం టెండెంట్ తన బలగంతో చుట్టుముట్టాడు. ఒక్కొక్క సార్జెంట్ క్రింద పది మంది చొప్పున సూపరింటెండెంటు బలముంది. అందులో ఒక సార్జెంట్ మాత్రమే కిరస్తానీ. అతని క్రింది పదిమంది కూడా ఆంగ్లేయులే. మిగతా సార్జెంటుతో పాటు వారి క్రింది వారందరూ భారతీయులే.

ఎవరూ కదలరాదని, నరసింహారెడ్డిని బంధించితీసుకొని పోతామని ఆర్డరు జారీ చేసారు. అప్పుడు వందలాది మంది నరసింహారెడ్డికి వలయంగా ఏర్పడి ఆయన కనబడకుండా చేశారు. కాని రెడ్డి సామాన్యుడు కాడు. అవక్రవిక్రముడు ; అద్వితీయ పరాక్రమశాలి. అందరినీ చీల్చుకొని ముందుకు దూకాడు.

ఆ సమయంలో సూపరింటెండెంటు తుపాకీ కాల్పులకు ఆజ్ఞలు జారీ చేశాడు. ముందున్న సార్జెంటులందరూ వారి భటులందరూ భారతీయు లైనందువల్ల వారు తుపాకులను పైకి కాల్చారు. కాని కిరస్తానీ సార్జంటు క్రిందివారు మాత్రం ప్రజలపైకి కాల్పులు జరిపారు. ప్రజ లందరూ ఆ సార్జెంటుపైకి, అతని భటులపైకి దూకారు. వారి తుపా కులు లాక్కొని అందులోని ఆర్గురిని కాల్చి చంపారు. కిరస్తానీ సార్జం టును చంపేశారు.

ఆ సమయంలో ఇక లాభం లేదని మిగతా సైన్యం సూపరింటెండెంటు, తహసిల్దార్ పారిపోవడం ప్రారంభించారు. రెడ్డి వారిని తరిమి, సూపరిం డెంటు తహసిల్దార్ల తలలు నరికేశారు. ఇద్దరు ఆంగ్లసైనికులను సంహ రించాడు. మిగిలిన ఇద్దరిని ప్రజలు సంహరించారు.

సద్దుమణిగింది. ప్రజల్లో ఇద్దరు మరణించారు. నలుగురు గాయ పడ్డారు. అయిదుగురికి రెడ్డి దహన సంస్కారాలు చేయించి, అందరూ కోడిపందేల స్థలానికి విచ్చేచశారు. తెల్లవారిని ఈ దేశం నుండి తరిమి వేయడానికి చేయాల్సిన పనులన్నీ చేయాలని మొక్కవోని ధైర్యంతో నిలబడాలని ప్రజలనుద్దేశించి ఉయ్యాలవాడ నరసింహారెడ్డి ప్రసం గించాడు. అందరూ నరసింహారెడ్డికి జైకొట్టారు.

## యుద్ధకేంద్రంగా నల్లమలకోట

వాట్సన్ యుద్ధంలో ఓడిపోయి పారిపోయారు. ఇద్దరు తహ సిల్దార్లు, ఒక సూపరింటెండెంటు, ఓ సార్జెంట్, అతని క్రింది సైనికులు



వధింపబడ్డారు. కోవెల కుంట్లలో అంతకు పూర్వమే ఖజానా కొల్లగొట్టబడింది. వాట్సన్ తెప్పిస్తోన్న మందుగుండు సామగ్రి దోయబడింది.

తాము భరణం ఇస్తే బ్రతుకుతున్న నొసము, ఉయ్యాలవాడ, నల్లమలకోటల అధిపతి అయిన ఉయ్యాలవాడ నరసింహారెడ్డి ఇదే విధంగా విజృంభించి అందరినీ కూడగట్టి ఉద్యమాన్ని నిర్వహించి నట్లయితే మొదట దక్షిణ భారతంలో ఆ తర్వాత ఉత్తర భారతంలో తమకు నూకలు చెల్లినట్లే. ఏ విధంగానైనా సరే నరసింహారెడ్డిని పట్టు కోవాలి, లేదా సంహరించాలి.

దక్షిణభారతానికి చెన్నపట్టణం మూలకేంద్రం. అక్కడ ఆంగ్లే యాధికారులు పై విధంగా సమాలోచనలు నిర్వహిస్తున్నారు. కుటిల రాజనీతిలో ఆరితేరినవారు, రవి అస్తమించని సామ్రాజ్యాన్ని స్థాపిం చామని విఱ్ఱవీగుతున్నవారు, భరతఖండ దేశభక్తులను వేలాదిమందిని పొట్టన పెట్టుకొన్నవారు, కపట వ్యూహంతో - మాయోపాయంతో గాని గెలువలేని వారు అయిన బ్రిటీషర్సు సుదీర్ఘ సమాలోచనల అనంతరం ఒక నిర్ణయానికి వచ్చారు.

యుద్ధవిద్యలో ఆరితేరిన వాట్సన్‌ను సర్వసేనాధిపతిగా నియ మించి మందుగుండు, మారుదండు, మానవశక్తిని సమకూర్చి బయలు దేరమన్నారు. చెన్నపట్టణం నుండి నార్టన్ బయలుదేరాడు. వేల సైన్యాన్ని కడపలో, బళ్ళారిలో నియమించే ఏర్పాటు చేశాడు. పదార్థాలకు,

డబ్బుకు, ఆయుధాలకు కొదవలేని విధంగా సమకూర్చుకొన్నాడు. గూఢచారులద్వారా నరసింహారెడ్డి ఉయ్యాలవాడలోగాని, నొసము కోటలో గాని లేడని, నల్లమలలోని గిరిదుర్గంలో ప్రస్తుతం ఉంటున్నాడని అక్కడినుండే పరిపాలన యుద్ధతంత్ర వ్యవహారాలు నిర్వహిస్తున్నాడని తెలుసుకొన్నాడు. నల్లమల అడవుల్లోని రహస్య పథాలు తెలిసిన వారిని పిలిపించుకొన్నాడు. లెక్కలేనంత డబ్బు ఖర్చుపెడుతున్నాడు. నార్టన్ ఈ విధంగా పూర్వరంగ సంసిద్ధతతో కదలి గిద్దలూరు దగ్గర సైన్యం విడిది చేయించాడు.

అక్కడికి నల్లమలకోట ఆమడ పైచిలుకు దూరంలోనే ఉంది. నార్టన్ శక్తి కుయుక్తులు, సైన్య బలగం సంగతులు ఎప్పటికప్పుడు నరసింహారెడ్డికి అందుతూనే ఉన్నాయి. గిద్దలూరు దగ్గర నార్టన్ విడిదిచేసినాడని తెలిసిన తర్వాత తన బలగాలను అప్రమత్తం చేసి కీలకస్థానంలో వారిని నియమించాడు ఉయ్యాలవాడ నరసింహారెడ్డి.

## కోట దగ్గరికి రాకుండానే శత్రువధకు వ్యూహం

నల్లమలలో దారులు కనుక్కొని వారు కోట దగ్గరకి రారాదు. ఆ విధంగా కీలకస్థానాల్లో ఉండి వారిని చీకాకు పరచాలి. ఈ యుద్ధంలో వారి పక్షాన కిరాయి సైనికులుగా నిలిచిన ఎందరో భారతీయులు మరణిస్తారు తప్పదు. కేవలం పొట్టకూటికి సైన్యంలో వారూ చేరారేగాని వారూ దేశభక్తులే. కిరాయి సైనికులుగా వచ్చిన మనవారెవరైనా మనవైపు తిరుగుతారేమో చూడాలి. తెల్లవారు పిడికెడంతమందే ; సైన్యంలోని అందరూ భారతీయులే.



తప్పదు ; మనవారి మరణం తప్పదు. ఇనుపకడ్డీని అగ్గిలో కాల్చి దాని రూపురేఖలు మారుస్తున్నప్పుడు, కడ్డీతోపాటు నిప్పూ ఆ దెబ్బ తింటుంది కదా! అదే విధంగా బ్రిటీషువారికి బాసటగా నిలిచిన భారతీయ కిరాయి సైనికులూ దెబ్బతింటారు. ఇక వెనకముందు చూడవలసిన అవసరం లేదు. గిద్దలూరు దగ్గరి మైదానప్రాంతం నుండి నార్టన్ బయలుదేరుతారు. వేర్వేరు గుంపులుగా వారి సైన్యం నల్లమలలోకి వస్తుంది. ఆయా ప్రదేశాలు కనిపెట్టి శత్రువును దెబ్బతీయండి. అడవిలో అడుగుపెట్టిన ఇంగ్లీషు సైనికులు మళ్ళీ బయటికి వెళ్ళడానికి వీలులేని వ్యూహరచనతో ముందుకు సాగండి ; జయం మనదే అంటూ దళపతులను ఉత్సాహపరచి నల్లమల కీలక ప్రదేశాల్లో వారిని నిలిపాడు నరసింహారెడ్డి.

## గిద్దలూరు యుద్ధం

ఇక తాను స్వయంగా ఏమరుపాటున ఉన్న సమయం చూచి శత్రుశిబిరం మీద దాడిచేయాలని నిర్ణయించుకొన్నాడు. ఆ రోజు అర్ధరాత్రి వరకు గిద్దలూరు సమీపంలో సైన్య శిబిరంపైకి దాడిచేశాడు. ఎక్కడా హాహాకారాలు లేవు. లోనికి ప్రవేశించిన వారు మొదట దివిటీల నార్పారు. శత్రువుల ఆయుధాలు నిల్వచేసిన గుడారం దగ్గరున్న బ్రిటీషు సైనికులను సంహరించారు.

హాహాకారాలు మిన్నుముట్టాయి. గుడారంలోని సైనికులు లేచారు. అందిన ఆయుధాన్ని పట్టుకొని చీకటిలోకి దూకారు. రెడ్డి సైన్యం మొదలే

జాగ్రత్తపడింది. తమవారిని గుర్తించే చిహ్నాలు ధరించింది. ఆయుధాలు అందుకోడానికి గుడారం వైపు వస్తున్న తెల్ల సైనికుల నెందరినో సంహరిస్తున్నది.

గుఱ్ఱం మీద తిరుగుతూ అందిన ఆంగ్లేయుణ్ణి కత్తికెరజేస్తూ ప్రేత భూమిలో తిరిగే కాలరుద్రునిలా గిద్దలూరు గుడారాల రణస్థలిలో ఉయ్యాలవాడ నరసింహారెడ్డి మహాభయంకరంగా తేజస్సుందరంగా భాసించాడు.

తెల్లవారే వరకు నార్టన్ లేడు ; అతని సైన్యంలో సగభాగానికి పైచిలుకు ఎప్పుడో కాలుకు బుద్ధిచెప్పింది. ఎందరో ఆయుధాలు విసర్జించి కూర్చున్నారు. సైన్యంలో పావు భాగం చనిపోయింది.

గుడారంలోని ఆయుధాలను దోచుకొని, పట్టుబడ్డ సైన్యాన్ని మళ్లీ బ్రిటీషువారి సైన్యంలోకి వెళ్లరాదని శాసించి, వారి వారి స్వగృహాలకు వెళ్లాల్సిందిగా దారిబత్తాలు ఇప్పించి తన సైన్యంతో నల్లమల అడవుల్లోకి వెళ్లిపోయారు ఉయ్యాలవాడ నరసింహారెడ్డి.

## నల్లమల కోట పతనం

దెబ్బతిని పారిపోయిన నార్టన్ బళ్లారి చేరుకొన్నాడు. అక్కడ ఉన్న మూలబలాలతో, ఎవరి ఆయుధాలు వారి దగ్గరే ఉండే పద్ధతి ఏర్పాటు చేసి, నల్లమల కోటకు వెళ్ళడానికి ఒకవైపు నుండి మాత్రమే అడవిని నరుకుతూ కోట దరి చేరాలని వ్యూహం రచింపబడింది. అనుకొన్న



విధంగా ఒక వైపు నుండే నల్లమల అడవుల సమీపానికి నార్టన్ సైన్యం చేరింది.

అప్పటికే నరసింహారెడ్డి ధర్మపత్ని మరణించింది. ఆయన వ్యూహాలకు తోడుగా నిలిచిన విజయలక్ష్మి ఆయనను వదలి వెళ్లిపోయింది. కాశీకి వెళ్లిన తల్లి ఇక తిరిగిరాలేదు. వారిరువురికి నువ్వులు నీళ్లు వదలి, కదలికోటవైపు వస్తున్న కుంపినీ సైన్యాన్ని ఎదుర్కోవడానికి సంసిద్ధుడయ్యాడు నరసింహారెడ్డి.

ఈ పర్యాయం నార్టన్‌కు అడుగడుగునా కడప కలక్టర్ కాక్రేన్ సహకారమందింది. వనం నరుకుతూ ముందుకు సాగే వారిని ప్రత్యేకంగా నియమించడం జరిగింది. నరుకుతూ వెళ్ళేవారికి రక్షణగా గుఱ్ఱాలపైనున్న మిలిటరీ సైనికులు నరసింహారెడ్డి సైనికులను దూరం నుండే నిలవరిస్తూ వారిపై కాల్పులు జరుపుతూ, వారు వెనుకకు తగ్గి కోటలోకి వెళ్లిపోయేట్టు చేశారు.

కోట సమీపంలోకి నార్టన్ సైన్యాలు వచ్చాయి. నల్లమలకోట కొండమీద కట్టబడింది. ఆ కొండచుట్టూ సైన్యం విడిదిచేసింది. గుడారాలు వేసింది ; పైనుండి దొర్లించే రాళ్ళు గుడారాలకు తాకకుండా చెట్ల చాటున గుడారాలు వేసింది.

ఇక శతఘ్నులు కోటకు సమీపంలో మోహరింపబడ్డాయి. ఒక చోట గాక నాలుగువైపుల శతఘ్నులను నిలిపి కోటగోడపై నార్టన్ నాలుగు దిశలనుండి వందల పర్యాయాలు గుండ్లు కుమ్మరించాడు.

నరసింహారెడ్డి ఓబన్న, వెంకన్నలతో సమాలోచనలు జరిపారు. పగటిపూట తాము మిన్నకుండాలని నిర్ణయించారు. రాత్రివేళ కోట రహస్య ద్వారాలనుండి అడవుల్లోకి వెళ్లిపోయి వెనుకవైపునుండి సైన్యంపై దాడి చేసి వారందరూ మళ్లీ గ్రామాలలోకి వెళ్లాలనే వ్యూహం రచింప బడింది. గ్రామాల్లో దాగి మళ్ళీ రాత్రి సమయంలో శత్రువుపై దాడిచేసి సంహరించాలని నిర్ణయాలు జరిగాయి. ఈ బయటి యుద్ధానికి ఓబన్న, వెంకన్న నాయకత్వం వహించారు.

ఆ రోజు రాత్రి రెడ్డి సైన్యం రహస్యద్వారాల గుండా అడవుల్లోకి వెళ్లిపోయింది. ఒకటి రెండు చోట్ల దాడిచేసి కొందరిని సంహరించింది. కోటపైనుండి గుండ్ల వర్షం కురిపించింది. కాని బ్రిటీషు సైన్యం వెంటనే అప్రమత్తమై ఎదురుదాడి చేసింది. ఇరువైపులా వందలమంది మరణిం చారు. ఎందరో గాయపడ్డారు. తెల్లవారిన తర్వాత యుద్ధమనేదే లేదు.

నరసింహారెడ్డి రాత్రిపూటనే యుద్ధం చేయాలన్న వ్యూహంతో ఉన్నట్టు బ్రిటీషువారికి అర్థమయింది. అది భారతీయుల ధర్మయుద్ధం కాదు. ధర్మాధర్మాలను వదలి విజయం నిమిత్తం చాటుమాటు పోరా టాన్నే ఆయన ఆశ్రయించాడని వారు అర్థం చేసుకొన్నారు.

ఆరోజు పగటిపూట వందల శతఘ్నులను కోటగోడలమీద క్రుమ్మరించింది బ్రిటీషు సైన్యం. కోట అక్కడక్కడ పగుళ్ళు వారింది. దాదాపు నెలరోజుల యుద్ధానంతరం ఏర్పడ్డ పరిస్థితి ఇది. కోటకు ఒక వైపునుండి అడవిలోకి దారి ఏర్పడింది. అది బ్రిటీషు సైనికుల చేతుల్లో



ఉంది. వారికి కావల్సిన ఆహారపదార్థాలు మందుగుండు సామగ్రి ఎప్పటి కప్పుడు ఆదారి నుండే అందుతున్నాయి. అడవుల్లోకి వెళ్లిన రెడ్డి సైన్యం దానిని నిరోధించలేకపోయింది. కోటగోడ కూలడం ఖాయమని తేలిపోయింది.

ఆ రోజు రాత్రి మిగిలిన సైన్య బలగాలతో కోటను పూర్తిగా వదలిపెట్టి నరసింహారెడ్డి దట్టమైన అడవుల్లోకి వెళ్లిపోతూ, ఆంగ్ల సైన్యంపై దాడిచేశాడు. వారు కోటలోని వారని ఆంగ్లసైన్యం గుర్తించలేక పోయింది. అడవుల్లో దాగిన మరోదండు దాడి ఇది అని వారనుకొన్నారు. ఆ దాడి తర్వాత కొద్దిపాటి బలగంతో దట్టమైన అడవుల్లోకి వెళ్ళి పోయాడు నరసింహారెడ్డి.

ఆ మరుసటి రోజు కోటగోడ కూలింది. ఆంగ్ల సైన్యానికి ఎదురుదాడి అనేది ఎదురుకాలేదు. కోటలో నరసింహారెడ్డి ఎక్కడో దాక్కొని ఉన్నాడనే వారనుకొన్నారు. బిక్కు బిక్కుమంటూ మారణాయు ధాలు చేతబట్టి కోటంతా గాలించారు.

ఆంగ్లసైన్యం దాడికి ముందే కోటలోని పిల్లలనూ, స్త్రీలనూ, వృద్ధులను పంపించి వేశారు. కోటలో కేవలం వంటవాళ్లు, ఆయుధాలు సమకూర్చేవాళ్ళు, బయటనుండి పదార్థాలు తెచ్చేవాళ్లు, యుద్ధవీరులు తప్ప మరెవరూ లేరు. వారు గూడా యుద్ధం ప్రారంభమైన తర్వాత రాత్రిపూట బ్రిటీషు సైన్యం కనుగప్పి అందరూ వెళ్లిపోయారు. చివరగా కోటను వదలింది కూడా నరసింహారెడ్డే.

నార్టన్ నేతృత్వంలో, కలక్టర్ క్రాక్రేన్ అజమాయిషీలో కోట అంగుళం అంగుళం గాలింపు జరిగింది. కోటలో వారికి ఒక్క పురుగు కూడా కనిపించలేదు.

వెంటనే ఒక వందమందిని కోట శిథిల ద్వారం దగ్గర నిలిపి, నల్లమల లోతట్టు అడవుల్లో గాలింపుకు ఆజ్ఞలు జారీ చేశారు. ఇది గ్రహించిన నరసింహారెడ్డి స్థావరాలు మార్చుతూ అడవిలో భాగంలోకి వెళ్లిపోయాడు.

ఓబన్న, వెంకన్న ఇద్దరూ ఆంగ్లసైన్యం చేతుల్లో చనిపోయారు. 1843లో ప్రారంభమైన పోరు మూడు సంవత్సరాలు జరిగింది. నరసింహారెడ్డి సైన్యం చెల్లా చెదురయ్యింది. ఎందరో చనిపోయారు. ఓ వేయి మంది పట్టుపడ్డారు. దాదాపు మూడు వేల మంది చనిపోయారు. మరో మూడువేల పైచిలుకు సైనికులు తమ తమ గ్రామాలకు వెళ్లిపోయి వివిధ వృత్తుల్లో చేరిపోయారు.

## ఏకైక వీరుడు నరసింహారెడ్డి

నరసింహారెడ్డి ఒక్కడే ఉన్నాడు. ఆయన మాత్రం సైన్యం కంట పడలేదు. అడవిలో ఎక్కడున్నాడో ఎవరికీ అర్థం కాదు. వెదకడానికి వెళ్ళిన అయిదార్గురిలో నలుగురైదుగురు చస్తున్నారు. చావు కబురు చెప్పడానికా అన్నట్లు ఒకరిద్దరు మిగిలి వస్తున్నారు. ఈ విధంగా నెలలకు నెలలు గడచిపోయాయి. అయినా నరసింహారెడ్డి శత్రు సైన్యానికి చిక్క లేదు.



నల్లమలలో అంతర్భాగంగా ఉన్న ఎఱ్ఱమలవైపు నరసింహారెడ్డి సాగిపోయాడు. ఒకే ఒక్క నమ్మినబంటు వెంట ఉన్నాడు. తమ పూర్వీకులు ఆ ఎఱ్ఱమలలో జగన్నాథమనే ప్రదేశంలో కట్టించిన నరసింహ దేవాలయాన్ని తన స్థావరంగా చేసుకొన్నాడు. ఆ నమ్మిన బంటును అడవికి అనతి దూరంలో ఉన్న అల్వ కొండకు పంపి తన నివాసం ఒక యింటిలోని వారికి తెలుపమన్నాడు.

అల్వకొండలో యాదవుల ఇండ్లున్నాయి. ఆ ఇండ్లల్లోనే జానకమ్మ నివసిస్తున్నది. నరసింహారెడ్డి నొసము కోటలో ఉన్నప్పుడు ఈ జానకమ్మ ఆయన్ను తన ఆటపాటలతో సంతోషపెట్టేది. రెడ్డి బ్రిటీషు వారిని ఎదిరించడంలోనే నిమగ్నం కావడంతో, ఆమె కోటవదలి పెట్టి తమ బంధువులున్న అల్వకొండ చేరింది. ఆ నమ్మినబంటుకు తప్ప ఈ సంగతి ఎవరికి తెలియదు. అతనూ యాదవుడే కిష్టప్ప. నరసింహారెడ్డి జగన్నాథంలోని దేవాలయంలో ఉన్నస్థితిని ఆమెకు చేరవేశాడు. ఆకులలాలు తింటూ, కాయగసర్లు మెసవుతూ, ప్రజల్ని సమీకరించి ఏయే వ్యూహాలతో ఈ తెల్లనక్కలను దేశం నుండి పారద్రోలాలా అని ఆలోచనలు చేస్తూ ఒంటరిగా మిగిలిపోయాడన్న సంగతి జానకమ్మకు తెలిసింది. తాను అన్నపానీయాలు తీసుకొని రాత్రివేళ పయనించి నరసింహారెడ్డి దగ్గరికి వెడతానన్నది జానకమ్మ. మనమై మనము రెడ్డిని పట్టించి నట్లవుతుందని, ఇప్పుడు సైన్యం గాలింపు కూడా మానివేసిందని, తాను అప్పుడప్పుడు రాత్రివేళ పయనించి రెడ్డికి ఆహారం అందజేసి వస్తానని కిష్టప్ప అన్నాడు. ఎటువంటి మహావీరునికి ఎటువంటి స్థితి దాపురించిందని జానకమ్మ బోరున ఏడ్చింది.

## పట్టుబడ్డ వీరనరసింహారెడ్డి

పదిమంది ఉన్న అయిదారు దళాలు మాత్రమే గాలింపుల్లో ఉన్నాయి. ఒకరోజు కిష్టప్ప తెల్లవారుజామున అడవిదాటి అల్వకొండ వైపు వెళ్ళడం ఒక దళం చూచింది. అందులో ఒకరు అతణ్ణి అనుసరించారు. అతను ఆ రోజు పగలంతా జానకమ్మ ఇంట్లోనే విశ్రాంతి తీసుకోవడం, మసక మసక రాత్రిలో ఆహారం మూటగట్టుకొని అడవి దారి పట్టడం వారు గమనించారు.

అడవిమొగలోనే అతణ్ణి బంధించి, ఆ రోజు సమీపంలోనే ఉన్న నార్టన్ ముందు నిలబెట్టారు. తిట్టలేదు. కొట్టలేదు. బుజ్జగించారు. లెక్కలేనంత ధనం ఆశచూపి రహస్యం రాబట్టారు.

అతణ్ణి వెంటనే ఆహారం ఇవ్వడానికి వెళ్లిపొమ్మన్నారు. కిష్టప్ప ఆ రోజు ఆలస్యంగా వెళ్లి మరుసటిరోజు అక్కడే ఉన్నాడు. కాని ఈ విషయం నరసింహారెడ్డికి తెలుపలేదు. ఆ మరుసటి రోజు రాత్రి బయలుదేరి తెల్లవారే వరకు అల్వకొండ సమీపానికి వచ్చాడు. ఆంగ్ల గూఢచారులు అతనికి అడిగినంత ధనమిచ్చారు. కిష్టప్ప ఏమీ ఎరగనట్లే జానకమ్మ ఇంటికి వెళ్ళాడు. ధనాన్ని గుంతదీసి దాచిపెట్టాడు. ఏమీ ఎరగనట్లే ఆ రోజంతా జానకమ్మ ఇంట్లో గడిపాడు. ఇలా కొన్ని నెలలు జరిగింది. కిష్టప్ప పూర్తిగా తమవాడై పోయాడని ఇంగ్లీషు వారి కర్థమై పోయింది. ఒకరోజు రాత్రి అతను తీసుకొని వెళ్ళే అన్నంలో విషం కలిపి ఇచ్చి అతణ్ణి అనుసరించి, జగన్నాథంలోని నరసింహ దేవాలయానికి ఒక మైలు దూరంలో పదిమంది ఆంగ్ల సైనికులు ఆగి పోయారు.



తెల్లవారే వరకు నరసింహదేవాలయానికి కిష్టప్ప చేరుకొన్నారు. ఆలయం ప్రక్కనే ఉన్న పడియలో నరసింహారెడ్డి స్నానసంధ్యలు ముగించుకొని, తిరునామం ధరించి, పూజా పునస్కారాలు చేసి, తీర్థ ప్రసాదాలు (తులసినీళ్ళు, కాయలూ, పళ్లూ) కిష్టప్ప కిచ్చి, తానూ తులసి తీర్థం తీసుకొని, కొంతసేపు విష్ణు సహస్రనామాలు పారాయణం చేసి బారెడు ప్రొద్దెక్కిన తర్వాత, జానకమ్మ పంపించిన, కిష్టప్ప తెచ్చిన చద్దిమూట తెరచి, అందులోని రెండు రాగి రొట్టెలను తిని, ఆ తర్వాత పెరుగు కలిపిన అన్నం తిని చేతి మూతీ కడుక్కొని ఎందుకో ఆయాసంగా ఉందిరా కిష్టప్పా అంటూ మగత నిద్రలోకి వెళ్లిపోయాడు.

వెంటనే కిష్టప్ప పరుగుదీశాడు. మైలు దూరంలో ఉన్న పదిమంది ఆంగ్ల గూఢచార సైనికులకు ఈ విషయం తెలిపాడు. వారు పరుగు పరుగున వచ్చి, ఆలయ మంటపంలో నరసింహస్వామి ఎదురుగా గాఢనిద్రలోకి జారిపోయిన నరసింహారెడ్డిని సమీపించడానికి భయపడి, ఎక్కడ కదలి మీద విరుచుకుపడతాడో అని గంట సేపు బిక్కు బిక్కుమంటూ ఆలయం చుట్టూ తిరిగి, చివరకు కిష్టప్పతోనే కాళ్ళూ, చేతులు త్రాళ్ళతో కట్టించి నరసింహారెడ్డిని మోసుకొని వెళ్లారు. 1846 అక్టోబరు 6వ తేదీన నరసింహారెడ్డి ఆ విధంగా పట్టుపడ్డాడు.

## ఉయ్యాలవాడ నరసింహారెడ్డికి ఉరిశిక్ష

అదివరకే వేయిమంది బంధింపబడ్డారు. అందరిమీద తీవ్ర ఆరోపణలతో కేసు నడిపించారు. 412 మందిని వదలివేశారు. 273

మందిని సెక్యూరిటీ తీసుకొని వదలివేశారు. 112 మందికి 5 సంవత్స రాలనుండి 14 సంవత్సరాల జైలు శిక్షలు విధించారు. ఇందులో కొంత మందిని ద్వీపాంతరాలకు పంపించి కఠినంగా హింసించారు. ఎదురు తిరిగిన కొంతమందిని నరికిపారవేశారు.

1847 జనవరి 9వ తేదీన (?) ఫౌజుదారీ అదాలత్ (మిలటరీ కోర్టు) శ్రీమజ్జరి (ఉయ్యాలవాడ) నరసింహారెడ్డికి ఉరిశిక్ష విధించింది. ఆ తర్వాత 1847 ఫిబ్రవరి 22వ తేదీన కలెక్టర్ కాక్రేన్ పర్యవేక్షణలో ఉదయం కోవెలకుంట్లలో (కొందరి ప్రకారం కోవెలకుంట్ల సమీపంలోని జుర్రేటినది ఒడ్డున) రెండువేల మంది సమక్షంలో అతి ఘోరంగా ఉరి తీశారు. ఆ తర్వాత అందరు చూస్తుండగానే రెడ్డి శవం తల నరికి కోవెలకుంట్ల ద్వారం దగ్గర తూముకి కట్టి, బ్రిటీషువారిని ఎదిరించిన ద్రోహులందరికిదే గతి పడుతుందని ప్రజల్ని హెచ్చరించి వెళ్ళిపోయారు. (ఆ తల 1877 వరకు అంటే 30 సంవత్సరాలు ఆ తూకుమానుపైననే ఉన్నది).

ఇంగ్లీషు దొరలు - సైనికులు అక్కడినుండి వెళ్ళిపోయిన తర్వాత ఆ తలక్రిందికి చేరి వేలాదిమంది బిగ్గరగా శోకించారు. అక్కడి మట్టిని తమ ఒంటికి పూసుకొని వెళ్లిపోయారు. ఇప్పటికీ ఆ తూకుమాను క్రింది మట్టిని (మృత్తంధాన్ని) తమ ఫాలతలంపై పూసుకొంటారు. మరి మనమూ ఆ మట్టిని మన ఫాలతలంపై పూసుకొందామా! ఆ వీర సింహంలా, ఆ రేనాటి సూర్యునిలా, ఆ రాయలసీమ వీరునిలా, ఆ భారత స్వాతంత్ర్య వీరునిలా మనమూ జీవిద్దామా!





# ప్రప్రథమ స్వాతంత్ర్య వీరుడు ఉయ్యాలవాడ నరసింహారెడ్డి

ఉయ్యాలవాడ నరసింహారెడ్డి భారత స్వాతంత్ర్య సంగ్రామ వీరుల్లో ప్రప్రథముడు. 1857 నాటి ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం కన్నా 11 సంవత్సరాలు ముందుగానే బ్రిటీషు ప్రభుత్వంపై రేనాటి సీమలో స్వాతంత్ర్య ధ్వజమెత్తిన మహావీరుడు. శ్రీరెడ్డి కేవలం రేనాటి సీమకో, రాయలసీమకో పరిమితమైన వీరుడు కాడు. ఆయన భారత స్వాతంత్ర్య సమరవీరుడు.

1846లో నరసింహారెడ్డి ప్రారంభించిన విప్లవం తెల్లవారి గుండెల్లో దడ పుట్టించింది. బ్రిటీషు క్రైస్తవ సామ్రాజ్యవాదుల దుష్టపాలన వైపు భారతీయులు దృష్టి సారించారు.

తళ్ళికోట యుద్ధంలో విజయనగర రాజులు ఓడిపోయారు. వారికి సామంతులుగా ఉన్న పాలెగాళ్ళు స్వతంత్రులయ్యారు. ఎవరికి వారే రాజులుగా చలామణి అయ్యారు.

టిప్పుసుల్తాన్ 1799వ సంవత్సరములో ఆంగ్లేయుల చేతుల్లో ఓడిపోయాడు. రాయలసీమ నైజాం నవాబు చేతుల్లో ఉండేది. బ్రిటీషువారి సైన్యసహకార పద్ధతిలో వారికి అప్పుపడి దత్తమండలాల పేరిట రాయలసీమ జిల్లాలను నిజాం తెల్లవారి కప్పగించాడు. ఈ దెబ్బతో పాలెగాండ్రందరు బ్రిటీషువారి పాలనలోకి వెళ్ళిపోయారు.

కడప - కర్నూలు జిల్లాల్లో (ఇప్పటి) ఆ రోజుల్లో వందమంది వరకు పాలెగాండ్రుండేవారు. ఆనాటి బ్రిటీషు కలక్టర్ సర్‌థామస్‌మన్రో పాలెగాళ్ల హక్కులన్నీ రద్దుచేశాడు. వారికి నెలసరి పింఛన్ ఏర్పాటు చేశాడు.

ఉయ్యాలవాడ పాళెగాడు పెద్దమల్లారెడ్డి. కోయిలకుంట్ల తాలూకాలోని ఉయ్యాలవాడను బ్రిటీషర్లు వశం చేసుకొన్నారు. ఆ జాగీరు నుండి 30 వేల రూపాయల రెవిన్యూ రాబడి ఉండేది. తెల్లవారు పెద్దమల్లారెడ్డి కుటుంబానికి 70 రూపాయలు పింఛన్ ఏర్పాటు చేశారు. తమ్ముడు చిన్నమల్లారెడ్డికి సగం పోగా 35 రూపాయలు పెద్దమల్లారెడ్డి కొడుకులు ముగ్గురికి పంచారు. ఆ పెద్దమల్లారెడ్డి చివరి కొడుకే ఉయ్యాలవాడ నరసింహారెడ్డి. ఆయనకు 11రూ. 10 అణాల 8 పైసల పింఛన్ వచ్చేది.

నరసింహారెడ్డి తల్లి నొస్సం పాళెగాడు జయరామిరెడ్డి కూతురు. ఆ నొస్సం జమీందార్ జయరామిరెడ్డి నరసింహారెడ్డికి తాత (మాతా మహుడు). ఆయనకు ఏటా 22 వేల రూపాయలు రెవిన్యూ వచ్చేది. మగపిల్లలు లేనందువల్ల ఆయన మరణించిన తర్వాత ఆ పింఛన్ ఎవరికీ ఇవ్వలేదు. ఆ తాతగారే నరసింహారెడ్డిని (మనుమణ్ణి) పెంచుకొన్నారు. బ్రిటీషువారు దత్తతకూ, పెంపకానికి చట్టబద్ధత కల్పించలేదు. పైగా దత్తతలో పెంపకాలు చెల్లవని శాసనం చేశారు. నరసింహారెడ్డి కర్నూలు జిల్లా రూపనగుడిలో జన్మించారు ; ఉయ్యాల వాడలో పెరిగాడు ; నొస్సం కోటను స్థావరంగా ఏర్పరచుకొన్నాడు.



నరసింహారెడ్డికి పింఛన్ ఇవ్వడం ఆపివేశారు. దీనిపై ఘర్షణ జరిగింది. 1846 జూన్లో కోయిలకుంట్ల తహసిల్దార్ రెడ్డినే రమ్మని హుకుంజారీ చేశాడు. పంపించిన మనిషిని తిట్టి తగలేశాడు. పైగా రెడ్డిపై వారెంట్ జారీ చేసి బంట్రోతులనూ భటులనూ పంపారు. రెడ్డి వారిని తన్ని తరిమి వేశాడు.

మాన్యాలు పోగొట్టుకొన్న కొండజాతుల వారెందరో రెడ్డితో చేతులు కలిపారు. వనపర్తి, మునగాల, జటప్రోలు, పెనుగొండ, ఔకు, జమీందార్లు రెడ్డికి మద్దతు పలికారు. హైదరాబాదు సలాంఖాన్, కర్నూలు పాపాఖాన్, బనగానపల్లె మహ్మదలీఖాన్ రెడ్డికి తోడుగా ఉంటామన్నారు. బోయలు, చెంచులు రెడ్డి సైన్యంలో చేరారు. బ్రిటీషర్లుకు వ్యతిరేకంగా 9 వేల సైన్యం సంసిద్ధమయ్యింది.

చాగలమర్రి తాలూకా రుద్రవరంపై రెడ్డి దాడి చేశాడు. మిట్టపల్లి వద్ద ఎదిరించిన పోలీసులను సంహరించాడు. ఈ దాడిలో ఓ దఫేదారు, తొమ్మిది మంది బంట్రోతులు మరణించారు. శ్రీరెడ్డి కోయిలకుంట్ల ట్రెజరీని దోచాడు. ఖజానా సిబ్బందిని చంపేశాడు.

కడప కలెక్టర్ చకచకా పావులు కదిపాడు. కడప నుండి కేప్టన్ నాట్ పెద్ద సైన్యంతో బయలుదేరాడు. జె.ఎన్. కొక్రేన్ మరో సైనికదళంతో రెడ్డిని ఎదిరించడానికి వచ్చాడు.

నరసింహారెడ్డి ప్రొద్దుటూరు సమీపంలో ఉన్న దువ్వూరు ఖజానాను దోచుకొన్నాడు. రెడ్డి ఒకటి రెండు దళాలు గుత్తి కనుమమీదుగా

పయనించాయి. ముండ్లపాడులో కొన్నాళ్ళున్నాయి. అక్కడికి సమీపం లోని కొత్తకోటలో రెడ్డి కొంతకాలముండి యుద్ధస్నాహాలు చేశాడు. గిద్దలూరు దగ్గర పాట్సన్ సైన్యాన్ని ఎదిరించి పోరాడాడు. రెండువైపులా కొంతమంది చనిపోయారు.

కొండల్లో కోనల్లో ఎటుచూచినా నరసింహారెడ్డే. బ్రిటీషర్ను ఎన్నో మాయోపాయాలు పన్నారు. రెడ్డిని పట్టిస్తే వేయి రూపాయలిస్తామని చాటింపు వేశారు. రెడ్డి సలహాదారు గోసాయి వెంకన్నను పట్టిస్తే వంద రూపాయలిస్తామన్నారు.

ఎర్రమల నల్లమల కొండల్లో ఎక్కడ చూచినా నరసింహారెడ్డే. చివరికి కలక్టర్ కాక్రేన్‌కు అందిన సమాచారం ప్రకారంగా 1846 అక్టోబర్ 6వ తేదీన ఎర్రమల - నల్లమల కొండల మధ్య నున్న పేరుసామలలోని జగన్నాథాలయాన్ని చుట్టుముట్టి దాడిచేశారు. శ్రీరెడ్డిని రక్షించడానికి ఎందరో పోరాడారు. స్వయంగా నరసింహారెడ్డి ఆంగ్లసైన్యం మీద దాడిచేశారు. ఆ సమయంలో ఇరుపక్కల్లో రెండు వందల వరకు మరణించారు.

నరసింహారెడ్డి బంధితుడయ్యాడు. ఆయనతోపాటు 901 మందిపై తెల్లవారు కేసులు పెట్టారు. వీరిలో 412 మందిని వదలివేశారు. వాళ్ళు నేరం చేశారని సాక్షులు ఎవరూ చెప్పలేదు. 273 మందిని మందలించి పూచీకత్తుపై వదలి వేశారు. 112 మందికి 5 సంవత్సరాలనుండి 14



సంవత్సరాల వరకు జైలు శిక్ష విధించారు. కొందరికి ద్వీపాంతరవాస శిక్ష విధించి దేశం వెలుపలికి పంపించారు.

స్వాతంత్ర్య వీర ఉయ్యాలనరసింహారెడ్డిపై ప్రత్యేక విచారణ జరిగింది. ప్రభుత్వం మీద తిరుగుబాటు చేశాడనీ, హత్యలకు దోపిడీలకు పాల్పడ్డాడని, హైదరాబాదు రాజ్యంలో ప్రాతకూరు జమీందారు లాల్‌ఖాన్‌తో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపి బ్రిటీషువారి హత్యలకు పథకం వేసి దేశద్రోహం చేశాడని నేరాలు మోపారు. ఆ ఉత్తరాలనే బలమైన సాక్ష్యాలుగా చూపించారు.

కడప స్పెషల్ కమీషనరు కేసుల విచారణ జరిపాడు. ఉరిశిక్ష విధించాడు. ఈ ఉరిశిక్ష కూడా చిత్రంగా అమలుజరిపారు. 1847 ఫిబ్రవరి 22వ తేదీన ఉదయం 7 గంటలకు నరసింహారెడ్డిని ఉరి తీస్తారని ఊరూరా చాటింపు వేశారు. (కొందరి అభిప్రాయం ప్రకారంగా ఆ రోజు ఫిబ్రవరి 21) కాక్రేన్ అక్కడ స్వయంగా ఉండి ఉరి తీయించాడు. ఉరి తర్వాత ఆ స్వాతంత్ర్యవీరుని శిరస్సు ఖండించారు.

ఈ విషాద దృశ్యాన్ని చూస్తూ రెండువేల మంది కంటికి మంటికి ఏకధారగా ఏడిచారు. కాని ఒక్కరు కిమ్మనలేదు. వారి నోళ్లకు తాళాలు పడ్డాయి. బ్రిటీషు వారంటేనే ప్రపంచంలోని పరమ రాక్షసుల్లో ఒకరని అభిప్రాయాలు ఏర్పడ్డాయి.

ఆ మహావీరుని శిరస్సును కోయిలకుంట్ల దగ్గరి బురుజుమీద తూకుమానుకు వ్రేలాడదీయవలసినదిగా కూడా తీర్పు ఇచ్చిన తీరు

చరిత్రలో మరెక్కడా జరగకపోవచ్చు. బ్రిటీషు వారికి ఎదురు తిరిగిన భారతీయులందరి శిరస్సులు ఈ విధంగానే వ్రేలాడదీయబడతాయి అన్న బెదిరింపే ఇదంతా. ఆంగ్ల న్యాయమూర్తుల తీర్పుల్లో ఎంత కర్కశత్వం ఉందో చరిత్ర సాక్షిగా ఉయ్యాలవాడ నరసింహారెడ్డి ఉరితీత, శిరఃఖండనమే నిదర్శనం.

కాని ఆ రేనాటి (రాయలసీమ) కాదుకాదు భారతీయ ప్రథమ స్వాతంత్ర్య వీరుని బలిదానం ఊరకేపోలేదు. మరోవంద సంవత్సరాలకు స్వాతంత్ర్యం తెచ్చి పెట్టింది.

* * *



## అనుబంధం - 2 (జానపదాల్లో)

1845-47 మధ్యకాలంలో స్వాతంత్ర్యవీరుడు ఉయ్యాలవాడ నరసింహారెడ్డి భారతీయ జనత గుండెల్లో గుండెగా నిలిచిపోయాడు. పల్లె ప్రజల్లో మరీను. ఆ కారణంగా జానపదులు పదం కట్టుకొన్నారు ; కొండల్లో కోనల్లో, పల్లెల్లో పట్టణాల్లో పాడుకొన్నారు. జంగం కథలుగా చెప్పుకొన్నారు. సుద్దులవారు పాడి ప్రచారం చేశారు. పిచ్చుకుంట్ల వారు వాద్యాలు పట్టి గళమెత్తి పాడి వినిపించారు. కోలాటం పాటలూ వచ్చాయి. గ్రుడ్డి దాసరులూ పదాలు గట్టి పాడుకొన్నారు.

1. సైరానరసింహారెడ్డి
   నీపేరే బంగార్వుకడ్డి
   రాజారావు రావుబహద్దరు నారసింహారెడ్డి
   రెడ్డికాదు బంగార్పుకడ్డీ నరసింహారెడ్డి
   ములుకోల్‌కట్టె సేతిలో ఉంటే మున్నూటికి మొనగాడు
   రెడ్డి మాటలు ఏదాలూరా[1] రాండి సూరులారా, ॥సైరా॥

   మొనగాంద్రకు రేనాటి గడ్డరా - రోషగాంద్రకు పెద్దపేరురా
   దాన ధర్మములు దండిగసేసే - పురిటి గడ్డలో పుట్టినావురా ॥సైరా॥

   కల్వటాల[2] దండదిగోరా సై - ముక్కముళ్ళ[3] దండిదిగోరా సై
   సంజామల [4]దండదిగోరా సై - కానాల్[5] దండదిగోరా సై ॥సైరా॥

గడ్డమానము [6]రెడ్డి మానము - తీసిన ఆ తొత్తు[7]
కోయిలకుంట్లలో గొంతు కోసిరి ఖజాన తీసిరి
దొరల పేరుతో గడ్డన దోచిన దొంగల ధనమంతా
పేదసాదలకు పంచినాడురా నారసింహారెడ్డి ॥సైరా॥

బానిసగుండి పాశం [8]తాగుట మేలుకాదురన్నా
పచ్చుల నాగా[9] బతికితే రెండే గింజలు మేలన్నా
బయపడి బయపడి బతికేకంటే సావే మేలన్నా
ఈరుడు సచ్చిన జగతిలో ఎప్పుడు బతికే ఉండన్నా ॥సైరా॥

గడ్డకోసము పానంపోయిన సారగం [10]వత్తుంది
ఈ పొద్దీదయ రేపు తదియరా నరుని పానమోయి
నీటిమీదను బుగ్గవంటిది నరుని శరీరంబు
పదరా పదరా తెల్లవారల తలలు నరుకుదాము ॥సైరా॥

బుగ్గమీసము దువ్వినాడురా - నారసింహారెడ్డి
తేజని [11]ఎక్కి దండుముందర నడచినాడు రెడ్డి
నొస్సం [12]కోటకి పెబువయ్యెనురా నారసింహారెడ్డి
తెల్లోలందరి గుండెలదిరెరా దండు కదలచూసి ॥సైరా॥

'నరసిమ్మా' అని దూకినాడురా రణంలోన రెడ్డి
తెల్లోలందరి కుత్తుకలన్నీ కోసినాడు రెడ్డి
కోబలీయంట తెల్ల సర్కరును నరికెను దండంతో
గడ్డకోసము సావోబతుకో తేల్చుకున్నరంతా ॥సైరా॥

- 'రాయలసీమ రాగాలు' లో ఆణిముత్యమిది.



(1. వేదాలురా 2,3,4,5 కర్నూలు జిల్లాలోని గ్రామాలు 6. పరువు 7. బానిస 8. పాయసం. 9. పక్షుల్లాగ 10. స్వర్గం 11. గుర్రం 12. కర్నూలు జిలాలోని గ్రామం.)

2. అదిగో వచ్చే ఇదిగో వచ్చే నారసింహారెడ్డి
పళపళ పళ పళ కేకలేసెరా నారసింహారెడ్డి
చంద్రాయుధమూ చేతబట్టెనే నారసింహారెడ్డి
కోబలీ రణబలీ యన్నాడే నారసింహారెడ్డి
ఆవులమందలో పులీ దుమికినా చందము దుమికినడూ
రెడ్డి ఎక్కినా గుఱ్ఱముల విడి ఏవిధ మొచ్చినది
కుప్పిటి గంతుల మీదా వచ్చెరా బారా హజ్జారీ
వచ్చిన వక్కా సైన్యము అంతా ముందుకు దుమికినదీ
వంచి నట్టి బల్లెముల పైననూ వాలలాడుతారు
సాన జేసినా కత్తులమీదా సవకళించినారు
అరవై ఒక్కా తుపాకులండీ ఫెళపెళవాగినవి
విరగనరుకుతా పోతాడయ్యా నారసింహారెడ్డి
తాటి పుచ్చెలా చందము నేడూ తలలే పోతావి
ఆలగోడురా బాల గోడురా కోయిల్‌కుంట్లలోన
ఎక్కడ చూచినా పీనుగు పెంటలు కోయిల్‌కుంట్లలోన.

(రేనాటి సూర్యచంద్రులు, పుట : 10)

* * *

3. ఈ పొద్దింట్లో రేపు మంటిలో నరుని ప్రాణమోయీ!
పుట్టబొయ్యి మన గుళ్ళదుర్తిలో మళ్ళీ పుట్టెమా?
చేరబొయ్యి మన రూపనగుడిలో మళ్ళీ చేరేమా?
చచ్చిన బ్రతికిన ప్రపంచమందూ పేరు ఒకటి చాలూ
నూరేండ్లు బ్రతికినా ఒక్కరోజునా వెళ్ళే పోవాలా
ఈ పొద్దింట్లో రేపు మంటిలో నరుని ప్రాణమోయీ
చచ్చిన బ్రతికిన ప్రపంచమందు ఖ్యాతి ఒకటిచాలు

✶ ✶ ✶

4. (బ్రిటిషు వారికి నరసింహారెడ్డిని పట్టుకోవడం శక్యం కాలేదు. అందువల్ల బళ్ళారిలో ఉన్న జాతి దొరలకు లేఖలు వ్రాశారు ; ఆశలు చూపారు)

రాంరాం రఘురాం రాఘవా అనంతగుణధామా!
బళ్లారిలో ఉండే జాతి దొరలకూ జాబులు వ్రాస్తారు.

"రెడ్డిని గనకా పట్టటానికీ మా చేతను కాలేదు
మీరు వైతేను మాటల చేతా రెడ్డిని పడతారు
శేరు శేరు బంగారు కడియములు బహుమతులిస్తాము
పిడికెడేసి బంగారు గొలుసులే బహుమతులిస్తాము
అందుకు మూడూ ఇందుకు నాలుగు ఏడులక్షలోయి
ఏడు లక్షలా పైకం మీకూ దొరలకు ఈనాము
అదీ సాలకా రాకాపోతే జాతిదొరల్లారా!



సాలుకు నూరూ గొడ్డుటావులూ బహుమతులిస్తాము
పన్నెం డొక్కా మోజు పాటేళ్ళు మీకే ఈనాము
సీమకొండి బరండిసారాయి మీకే ఈనాము
గరగర గరగర గరగర గరగర జాబులు వ్రాశారు
జాబులు వ్రాసీ మోరులు వేసీ సాగనంపినారు"

(రేనాటి సూర్యచంద్రులు - పు : 100)

✶ ✶ ✶

5. దొరవారి నరసింహారెడ్డి
నీ దొరతనము కూలిపోయె - రాజా నరసింహారెడ్డి
రేనాటి సీమలో రెడ్డోళ్ళ కులములోనా
దొరవారి వమిశానా ధీరుడేనరసింహారెడ్డి
కోయిల్‌కుంట్లా గుట్టలెంటా కుందేరు వొడ్డులెంటా
గుఱ్ఱమెక్కి నీవు వస్తే కుంపిణికి గుండె దిగులూ
కాలికి సంకెళ్ళు వేసి చేతికి బేడీలు వేసి
సారాతో పట్టి తెచ్చి బందికానులో పెట్టిరి
కండ్లకూ గంతలూ గట్టి నోటి నిండా బట్లు పెట్టి
నిలువునా నీ తల్లికేమో చావు సుద్దీ తెలిసినాదీ
కన్న కడుపే తల్లటించే గంగలోనా గంగగలిసే
దొరవారి నరసింహారెడ్డి
నీ దొరతనము కూలిపోయె రాజా నరసింహారెడ్డి

✶ ✶ ✶

# అనుబంధం - 3

## స్వాతంత్ర్య వీరుడు (పద్యకావ్యం నుండి)

కర్త: శ్రీపాణ్యం నరసరామయ్య

✶ శ్రీలు విలసిల్లు రాయల సీమయందు
రెడ్డి కులజులు మహిత నిర్ణిద్రమతులు
బాహుశక్తి ప్రజారక్తి పరిఢవిల్లి
ఏలుచుండిరి పూర్వంబు పాళెములను.

✶ వీరి కులములోన పెంపొందు పెక్కు శాఖ
లందు, మోటాటి శాఖ యందవతరించి
నట్టి వీరాధివీరుడుయ్యాలవాడ
నగర నిలయుండు మన కథానాయకుండు.

✶ అమితోద్దండ దురంత పీడనకులోనై, భారతీయ ప్రజా
సముదాయం బొనరించినట్టి, ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామరం
గముకన్నం బదియేండ్లకున్ మునుపె యాంగ్ల ప్రాజ్య సామ్రాజ్యసై
న్యముపై కత్తిని దూసినట్టి నరసింహారెడ్డి సామాన్యుడే?

✶ అరువది యాఱు గ్రామముల కాతడు నాయకుడై ప్రజాహితం
బరయుచు, పేదసాదలకు నాదరు విచ్చుచు, రాజధర్మసు
స్థిరుడయి రాజ్యపాలనము సేయుచు, హాయిగ నుండె, నింతలో
కఱకు బ్రిటిషు వణిక్కులకు కన్నుపడెన్ తదధీనమౌధరన్.



✶ కలికితురాయి గీల్కొలుపు పట్టు రుమాలు
కట్టిన యుత్తమాంగంబు తోడ
వైష్ణవ భక్తి భావము చాటు నూర్ధ్వపుం
డ్రమునీటు గొలుపు ఫాలంబుతోడ
క్రేతల కెంజాయరేక లింపారు, నా
తత దీర్ఘధవళ నేత్రముల తోడ
చిరు నిమ్మకాయల నిరువైపు నిల్పుకో
జాలిన గుబురు మీసముల తోడ
వైరిహంవీర విదళన ప్రళయకాల
దండ నిభ ఖడ్గ కలిత హస్తంబు తోడ
ప్రజకు భయభక్తి సంభ్రమ భావములను
గొలుపు వర్చస్సు తోడ నబ్బలియుడలరు.

✶ అతడు ప్రారంభమొనరించినట్టి యుద్య
మమ్మె రవులుచు, నొక దశాబ్దమ్ము నకును
క్షితి సిపాయి పితూరిగా కింవదంతి
గన్న స్వాతంత్ర్య సమరంబుగా జ్వలించె.

✶ అతని జీవాత్మ భౌతికమైన తనువు
వదలి యంతట వ్యాపించి, బహుమహోద్య
మమ్ములొనరించి, యొకశతాబ్దమ్మునకును
మాతృభూమికి స్వాతంత్ర్యమహిమగూర్చె.

✶ ✶ ✶

# కలియుగ కర్ణ - బుడ్డా వెంగళరెడ్డి

## జననం - బాల్యం

అభినవ దానకర్ణుడు బుడ్డా వెంగళరెడ్డి. ఆయన 1822వ సంవత్సరంలో ఉయ్యాలవాడలో జన్మించారు. రాయలసీమలోని కర్నూలు జిల్లాలో ఉన్న కోవెలకుంట్ల తాలూకాలోని గ్రామమిది.

ఆ గ్రామంలో రైతైనా రాజైనా చెప్పుకోదగ్గ వ్యక్తి నల్లపురెడ్డి. వారి ఇంటి పేరు మజ్జరి, గోత్రం చెరుకోళ్ల, ఆయన భార్య అక్షమ్మ. ఈ పుణ్యదంపతుల పుత్రుడే వెంగళరెడ్డి. చిత్రభాను సంవత్సరం - జేష్ఠమాసం - శుక్లపక్షం - గురువారం - రోహిణి నక్షత్రం - కర్ణాటకలగ్నం - పగటివేళ శ్రీ రెడ్డి జననం జరిగింది. జ్యోతిష్యులు జ్యోతిష శాస్త్ర శోధన చేసి వెంగళరెడ్డి కల్పవృక్షసదృశుడు అని తీర్మానించారు.

ఆ తర్వాత ఆ దంపతులకు తిమ్మమ్మ, సుబ్బమ్మ, ఈశ్వరరెడ్డి అనే సంతానం కలిగింది. అందరూ దినదినాభివృద్ధి చెందారు.

మంచి వ్యవసాయం, నల్లపురెడ్డికి మంచి పంటలు పండుతున్నాయి. ఆ ఊరిలో ఇది లేదన్న వారికి రెడ్డి దానధర్మాలు చేస్తున్నాడు. ఆ విధంగా దానాలందుకొన్నవారిలో పురోహితుల కుటుంబం కూడా ఉంది. ఆ కుటుంబం పెద్దే వెంగళరెడ్డికి చదువుసాములు కుదురుగా చెప్పాడు. విద్య - వ్యవసాయం రెండింటిలోనూ రెడ్డి నైపుణ్యాన్ని సంపాదించారు.

## వివాహాలు

తల్లిదండ్రులు వెంగళరెడ్డికి వివాహం చేయాలని నిశ్చయించారు. మేనమామ (తల్లిసోదరుడు) మేనత్త (తండ్రి సోదరి) ఇద్దరు పోటీ పడ్డారు. తమ పిల్లనే చేసుకోవాలంటే తమ పిల్లనే అని నేరుగా అడిగారు. నల్లపురెడ్డి కాదనలేకపోయాడు. వెంగళరెడ్డికి మేనమామ కూతురు వేంకటాంబను, మేనత్త కూతురు నాగమాంబను ఏకకాలంలో ఇరువురి నిచ్చి పెళ్ళిచేశారు. ఆ తర్వాత కొన్నాళ్లకు నాగమాంబ చనిపోయింది. వెంకటాంబకు సంతానం లేదు. అందువల్ల వెంగళరెడ్డి తరిగోపుల లక్ష్మిరెడ్డి కూతురు చెన్నమ్మను పెళ్ళిచేసుకొన్నాడు.

ఆమెకూ సంతానం కలుగలేదు. ఆస్తిపాస్తులూ - పాడీపంటా దండిగా ఉన్న తమకు సంతానం కలగలేదే అని వెంగళరెడ్డి దంపతులు చింతించారు. నోములు నోచారు. వ్రతాలు చేశారు. జంగములనూ, ఫకీరులను ఆదరించారు. ఇతరుల పిల్లలను దరిజేర్చుకొన్నారు. వారికి అన్నవస్త్రాలిచ్చారు. ముసలి, కుంటి, గ్రుడ్డి, కురూపులకు ఒంటెద్దు బండ్లు చేయించి దానమిచ్చారు. రోజూ తనతోపాటు పదిమంది లేకుండా అన్నం తిననని వెంగళరెడ్డి శపథం పట్టాడు. అన్నదానం ప్రతి నిత్యం ప్రతిక్షణం సాగుతూనే ఉన్నది ఆయింట అంటే అతిశయోక్తి కాదు.

## ఎఱ్ఱగాలి కరువులో రెడ్డి దానాలు

అది 1866 ధాతనామ సంవత్సరం. రాత్రింబవళ్ళు గాలి వీస్తున్నది. భూమి మీది ఎఱ్ఱమట్టి గాలిలో కలుస్తున్నది. అందుకే



అందరూ దానిని ఎఱ్ఱగాలి అన్నారు. పంటలు లేవు. పాడిలేదు, పశువులు బెదరిపోయినై. కఱవు ప్రళయతాండవం చేస్తున్నది. భూమిమీద పచ్చటి మొక్క కనిపించని కాలం దాపురించింది. ప్రజలు అడవులు పట్టి చెట్ల ఆకులు, కాయ కసరులు తింటున్న కాలమది.

వెంగళరెడ్డి మనస్సు కరిగింది ; వృద్ధులను పిల్లలను చేరదీసి ఆదుకొన్నాడు. తనతోపాటే వారందరిని కూర్చొనబెట్టుకొన్నాడు. అందరికీ అన్నం పెట్టించాడు. ఒక్కరోజు కాదు నెలలు.

ఉయ్యాలవాడ ప్రజలందరికి మళ్ళీ మంచి కాలం వచ్చింది. వర్షాలు పడేంతవరకు సరిపోయే ధాన్యం ప్రజలే గాక సమీపంలోని యాడికి గ్రామప్రజలనూ పిలిపించాడు. అందరికీ అన్నదానం, గరిసె లన్నీ అక్షయపాత్రలై వెలుగుతున్నాయి. ప్రభుత్వాలు నోరు తెరిచాయి. ప్రజలు చేతులెత్తి దండాలమీద దండాలు పెడుతున్నారు.

సమీపంలోని బళ్ళారి జిల్లా నుండి తండోపతండాలుగా జనం వచ్చి ఆరగించి పోతున్నారు. ఊరిలోని ధర్మసత్రాల్లో, పరిసరాల్లో, సమీప గ్రామాల్లో లెక్కలేనంత మంది ప్రజలు స్థిరపడిపోతున్నారు. అన్నం తినడానికి వస్తున్నారు. విశ్రాంతికి తమ తమ వసతులకు వెళ్ళి పోతున్నారు.

తమ్ముడు ఈశ్వరరెడ్డి, చెల్లెండ్రు, ఊరి ప్రజలు వెంగళరెడ్డికి తోడుగా ఉంటున్నారు. అన్నదానంలో పాల్గొంటున్నారు. ప్రజల సహ కారంతో కొత్తగా అన్నసత్రాలు కట్టించాడు. చలివేంద్రాలు పెట్టించాడు.

సకల సౌకర్యాలు కలిగించాడు. ఇది అది అని కాదు అన్ని విధాలుగా అందరినీ ఆదుకొంటున్నాడు.

### పేదలు చేసిన ప్రస్తుతి

మజ్జరి వెంగళరెడ్డిని ప్రజలందరు బడా వెంగళరెడ్డి అనడం మొదలుపెట్టారు. అబడాయే రాను రాను వారి నోట నలిగి బుడ్డా వెంగళరెడ్డిగా మారింది. ప్రజలు దీవిస్తున్నారు. ప్రశంసిస్తున్నారు.

**బుడ్డ వేంగళరెడ్డి! భూరి కలాప!**
**రెడ్డి దిలీప! స్వర్లేఖ ప్రతాప!**
**సద్గుణాలంకార! సద్ధర్మచరిత!**
**భర్గపంచాక్షరీపఠన ప్రవీణ!**
**దానధురీణ! సత్కరుణా కటాక్ష!**
**దీనరక్షక! ధర్మదేవత నిలయ!**
**మిము గొనియాడ నేమియు నేరమయ్య!**
**మమ్ము నుపేక్షింపక మఱియేలవయ్య!**

ఈ విధంగా ప్రస్తుతిస్తూ వెంగళరెడ్డికి దైవ సాక్షాత్కారం జరిగిందనీ, అందువల్లనే ఆయన ధాన్యాగారం అక్షయపాత్రయై వెలుగుతున్నదని చెప్పుకోవడం ప్రారంభించారు.

### అన్నదానంతో పాటు అన్యదానాలు

బుడ్డా వెంగళరెడ్డి వచ్చీపోయే జనాన్ని పరామర్శిస్తున్నాడు. నిరుపేద స్త్రీలకు గాజులున్నాయి. బొట్టుంది. కాని మంగళసూత్రం



లేదు. మెట్టెలు లేవు. కరవు తొలి తాకిడిలోనే ఎందరో పుస్తె మెట్టెలు అమ్ముకొన్నారన్న సంగతి రెడ్డికి అర్థమైపోయింది. ఆ విధంగా కనిపించిన వారందరికి వెంగళరెడ్డి పుస్తెమెట్టెలు చేయించి ఇచ్చాడు.

కరువు కారణంగా వివాహాలు నిలిచిపోయిన సంగతి రెడ్డికి తెలిసింది. ఈడూజోడూ చూసుకొని రమ్మన్నాడు. అలా వచ్చిన వారికందరికి ముక్కరలు, తాళిబొట్టులు, మెట్టెలు, పసుపుబట్టలిచ్చి పెండ్లిండ్లు చేయించాడు.

ఇంగ్లీషు దొరలు ముక్కున వ్రేలేసుకొన్నారు. వారు కరవు పరిశీలనలతో నివేదికలతో కాలం గడుపుతుంటే, వెంగళరెడ్డి మాత్రం తాత్సారం చేయకుండా అన్నదానంతో వస్త్ర దానంతో అన్ని దానాలతో ప్రజలను ఆదుకొని అక్కునచేర్చుకొంటుంటే ఆశ్చర్యపోయారు. వహవ్వా బుడ్డా వెంగళరెడ్డి అంటూ ప్రశంసల వర్షం కురిపించారు.

### బళ్లారి రైతులకు బండ్లు నాగండ్లు

పడమట వర్షం ప్రారంభమయింది. ఉయ్యాలవాడలో పరిసరాల్లో దానాలు అందుకొంటూ, అన్నంతో జీవం నిలుపుకొంటూ ఉన్న బళ్లారి రైతుల ఆనందానికి మేరలేదు. వారు తమ ప్రాంతానికి వెడతామన్నారు. రైతులందరికి బండ్లు నాగండ్లిచ్చి, విత్తనాలిచ్చి, వ్యవసాయపు పనిముట్లిచ్చి, దారిబత్తెములనిచ్చి సాగనంపాడు బుడ్డా వెంగళరెడ్డి.

బళ్ళారితోపాటు రాయలసీమంతా ఆదుకొన్న ఘనకీర్తి ఎవరిది? బుడ్డా వెంగళరెడ్డిదేనని ప్రజలు చెప్పుకొంటున్నారు. బ్రిటీషు ప్రభుత్వం లోని కలక్టరూ, కమీషనరు కర్ణాకర్ణిగ వినడమే కాకుండా బళ్లారికి తరలి వెడుతున్న రైతులను నిరుపేదలను కలిసి వెంగళరెడ్డి కథలన్నీ వ్రాసు కొన్నారు. ఆయన త్యాగాన్ని దానశీలాన్ని పుస్తకాల కెక్కించారు. అంతేకాదు ఎందరో నిరుపేదలు తమ పిల్లలకు వెంగయ్య, వెంగమ్మ అని పేర్లు పెట్టుకొన్నారు.

## విక్టోరియా రాణి పంపిన బంగారు పతకం

వెంగళరెడ్డి దాతృత్వం కలక్టరు ద్వారా గవర్నరుకు, గవర్నరుద్వారా విక్టోరియా మహారాణికి తెలిసింది. ఆమె రెడ్డిగారికి బంగారు పతకం పంపింది.

ఈ పతకానికి ఒక వైపున తెలుగులో, మరో వైపున ఇంగ్లీషులో రెడ్డి ప్రశంస ఉంది.

"1866వ సంవత్సరంలో సంభవించిన క్షామకాలంలో నిరాధారు లైన తన ప్రజల పట్ల చూపిన దానదయాభావాలకు మెచ్చి హర్ మెజస్టీస్ విక్టోరియా మహారాణి గారి ప్రభుత్వం ఆనవాలుగా బుడ్డా వెంగళరెడ్డికి ఈ బహుమానం ఇవ్వబడింది...."

కలక్టరు గౌరవంగా రెడ్డిగారిని పిలిపించి పదితులాల ఈ బంగారు పతకాన్ని కుడిచేతికి కట్టారు. వందలాది మంది సమక్షంలో బుడ్డా వెంగళరెడ్డికి గౌరవం దక్కింది.



ఆ తర్వాత వెంగళరెడ్డిని కమీషనరు ఎల్లీసు, ఇంజనీరు మోపరల్లి, కలక్టరు అనేక పర్యాయాలు దర్శించారు. ఆయన వ్యవసాయ విధానం, పాడిపంటలకై ఆయన పాటుపడే విధానం అన్నీ అడిగి తెలుసుకొన్నారు. బుడ్డా వెంగళరెడ్డి అన్నదాన సత్రంలోనే అందరూ భోజనం చేసి వెళ్ళిపోయారు.

## ధాత కరువులో చేసిన దానాలు

తన దగ్గర ఉన్న ధాన్యం అన్నదానానికే గాక వచ్చిన వారికి పంచి పెట్టిన కీర్తి కూడా ఆయనకే దక్కింది. ఇంటిలోని వెండిపాత్రలను , బంగారు పాత్రలను దూరదేశాల్లో అమ్మించి అక్కడినుండి కూడా ధాన్యం తెప్పించారు శ్రీరెడ్డి. రెడ్డి చెల్లెలు తిమ్మమ్మ, భార్యలిద్దరూ తమ తమ ఆభరణాలను కూడా అమ్మివేశారు.

ఒక చెలకలో ఉన్న తన జొన్న చేను కోయడానికి కూలీలు రాగా డబ్బులకు బదులుగా కంకులన్నీ వారికే ఇచ్చి తాను పశువుల మేత నిమిత్తం చొప్పను ఉంచేసుకొన్నాడు. కోతల సమయంలో ఒక్క దాన్యం గింజకూడా వృథా కానీయరాదని, అలాచేస్తే పాపం తగులు తుందని కూలీలకు బోధచేసేవాడు రెడ్డి.

బంగారు పతకం శ్రీ రెడ్డికి ఇచ్చినప్పుడు, ప్రభుత్వం ఏడువేల రూపాయల బహుమానం కూడా అదనంగా ప్రశంసాపూర్వకంగా ఆయన చేతపెట్టింది. అయితే ఆ సభా ప్రాంగణం దాటేవరకే ఆ ధనమంతా

దానం చేసి వెళ్లిపోయిన ఆయన దానశీల గుణం ఈనాటికి జనం నోట ఆడుతూనే ఉన్నది.

విక్టోరియా రాణి ఇచ్చిన బంగారు పతకం కూడా ఆయన దాన ధర్మాల్లోనే కరిగిపోయింది. కలక్టరడిగినప్పుడు ఎవరో ఎత్తుకుపోయారని వారు సమాధానమిచ్చారు. మద్రాసు గవర్నరుకీ సంగతి తెలియజేసి మరొక పతకం చేయించి కలక్టరు వెంగళరెడ్డికి బహూకరించారు. ఇప్పుడు వారి వారసుల దగ్గర ఉన్న పతకమదే అంటారు.

ఒక రోజు ఒక బ్రాహ్మణుడు వచ్చిన వెంటనే పదిరూపాయలు దానం ఇమ్మని అడిగాడు. అతని ప్రవర్తనకు రెడ్డి ఆశ్చర్యపోయి ఇంట్లోకి వెళ్ళి తెచ్చి ఇచ్చాడు. అయ్యో ఎక్కువ అడగకపోతినే అనుకొని ఆ పురోహితుడు తనకు వందరూపాయలు దానమిమ్మన్నాడు. "స్వామీ! మీకెంత అవసరముందో అంతే దక్కింది. దానితో తృప్తిపడి బయలు దేరండి!" మీ ప్రాప్తమంతే! అన్నాడు రెడ్డి. ఇచ్చే బుద్ధి లేక ప్రాప్త మంటున్నారన్నాడు బ్రాహ్మణుడు. శ్రీరెడ్డి వెంటనే లోనికి వెళ్ళి రెండు చేటల్లో బియ్యం పోసుకొని తెచ్చాడు. ఒక చేట క్రింద పది రూపాయలు మరోచేట క్రింద వందరూపాయలున్నాయని మీ ప్రాప్తం ఇప్పుడే తేలి పోతుంది ; మీకు ఏచేట కావాలో చెప్పండి! అన్నాడు. ఆ బ్రాహ్మణుడు ఒక చేట పట్టుకొన్నాడు. దానిలోని బియ్యం క్రింద నిజంగా పదిరూపా యలే ఉన్నాయి. రెండింటిలోనూ పదే ఉన్నాయని బ్రాహ్మణుడు పేచీ పెట్టాడు. రెడ్డి నవ్వుతూ ఆ మరోచేటలోని బియ్యం తీసి చూపించాడు. బ్రాహ్మణుడు నోరు మూసుకొని వెళ్ళిపోయాడు.



ధాన్యం బండ్ల కెక్కించిన తర్వాత వాటి వెనుకనే నడుస్తూ పొరపాటున క్రిందపడిన ఒక విత్తును కూడా ఏరి బండిలో వేసుకొని, ఇంటికి చేరాక అలా ఏరిన విత్తులన్నీ బండివాడికి చూపించి, ఒక విత్తుకూడా వృథా కారాదు సుమా అని అతనికి ధాన్య ప్రాధాన్యాన్ని, అన్నం అవసరాన్ని వివరించాడు.

ఇది పిసినారి తనమని హేళన చేసిన ఓ నలుగురు రైతులు వెంగళరెడ్డి ఇంటికి భోజనానికి వచ్చారు. వారు కాళ్ళు కడుగుకొని వచ్చి విస్తళ్ళ దగ్గర కూర్చున్నారు. తమ ముందున్న విస్తళ్లలో వెండి రూపాయ లుండడం చూసి, ఆశ్చర్యంతో వెంగళరెడ్డి దిక్కు చూశారు. "నేను ఏరింది ధాన్యాన్నే వెండి రూపాయలను కాదు. మీరిప్పుడు తినేది ధాన్యాన్నే! కాని ఈ రూపాయలను కాదు" అంటూ వారి విస్తళ్ళలో అన్నం వడ్డించి, తనను హేళన చేసిన కాపుల కళ్ళు తెరిపించిన సమయ స్ఫూర్తి మూర్తీభవించిన ప్రజ్ఞాధురీణుడు శ్రీరెడ్డి.

వెంగళరెడ్డి కీర్తి ప్రతిష్టలకు అసూయపడ్డవారు ఉన్నారు. ఆయనను చంపాలని వారు ఓ రోజు దారికాచారు. ఈ సంగతి ఓ హరిజనుల అబ్బాయికి తెలిసింది. రెడ్డిగారు గుఱ్ఱం ఎక్కి వెడుతున్నారు. ఈ అబ్బాయి ఆ గుఱ్ఱానికి అడ్డంగా వెళ్ళి ఫలానా మలుపు దగ్గర నలుగురు మిమ్మల్ని చంపాలని గొడ్డళ్లు నూరుకొని దాక్కొని ఉన్నా రన్నాడు. వెంగళరెడ్డి వెంటనే ఆ అబ్బాయిని తన గుఱ్ఱం మీద ఎక్కించుకొని మరో దారి వెంబడి ఇంటికి వచ్చేశాడు. ఆ హరిజన

అబ్బాయి ఆనాటినుండి వెంగళరెడ్డి ఇంటనే ఉన్నాడు. అతణ్ణి తన రక్షకునిగా భావించిన రెడ్డి ఎదిగిన తర్వాత మహావైభవంగా మూడు రోజులు పెళ్లిచేయించి, లెక్కలేనన్ని దానధర్మాలు చేసి, దీవించి ఓ ఇల్లిచ్చి ఆశీర్వదించాడు. ఆ సమయంలో మూడురోజులూ ఆ ఊరి వారికి, చుట్టుప్రక్కల ఊళ్ళవారికి బ్రహ్మాండమైన విందుభోజనం పెట్టించాడు. ఎవరి ఇంటిలో పొయ్యి రాజబెట్టినా జుర్మానా వేస్తానని దండోరా కూడా వేయించాడు.

ఉగాది పండుగనాడు వారు చేసే అన్నదానం మరీ ఎక్కువగా ఉండేది. వారి సమాధికి పూజ చేసి ఈ నాటికీ ఈ సంప్రదాయం వారి వారసులు కొనసాగిస్తున్నారు.

## భుక్తి ప్రదాతకు ముక్తి

ఇన్ని దానాలు ఈశ్వర ప్రీతికే తాను చేశానని, అందరిలో ఉన్న ఈశ్వరుణ్ణి తృప్తి పరచడమే తన ధర్మమనీ ఆయన అనేవారు. తన వృద్ధాప్యంలో కూడా ఆయన అన్నదానం కొనసాగించే ఏర్పాటు చేశారు. తన తర్వాత కూడా ఆ పద్ధతి కొనసాగాలని కూడా ఆయన పథకం వేశారు.

పిల్లలకు జ్వరాలు వస్తున్నాయి. టీకాలు వేస్తామంటే వేసుకోవడం లేదని, వైద్యులనుండి, తల్లి దండ్రుల నుండి ఫిర్యాదులందాయి రెడ్డికి. ఏం పిల్లలో ఏమో టీకాలంటే భయపడుతున్నారని తల్లిదండ్రులే పెదవి



విరిచారు. రెడ్డి ఊరిలో చాటింపు వేయించాడు. గుడి దగ్గర పిల్లలందరికి పప్పుబెల్లాలు పంచి పెడుతున్నారని చాటింపు. గంపల్లో పప్పుబెల్లాలతో గుడి దగ్గర రెడ్డి ప్రత్యక్షం. పొలో మంటూ పిల్లలందరూ వచ్చారు. అందరినీ వరుసగా నిలబెట్టి, వైద్యులను పురమాయించి, తాను పప్పు బెల్లాలు పిల్లలచేతికి నోటికి అందివ్వడం, వైద్యులు టీకాలు వేయడం అంతా చకచకా జరిగిపోయింది. పిల్లలు పప్పుబెల్లాలు తింటూ టీకాల బాధ మరిచిపోయారు. తల్లిదండ్రులు ముక్కుమీద వ్రేలేసుకొన్నారు. వైద్యులు రెడ్డిని ప్రశంసించారు. రెడ్డి చేయి మీసం మీదికి పోయింది.

ఆ రోజు ఆయన పరమపద ప్రాప్తి. క్షౌరం చేయించుకొన్నాడు. శరీరం మర్దన చేయించారు. అరగంట సేపు తలంటి స్నానం చేశాడు. భార్యలు స్నానం చేయించారు. స్నానం పూర్తి అయింది. రెండు చేతులు ముకుళించి దైవాన్ని స్మరించాడు. హరహరా అన్నాడు ; హరిహరీ అన్నాడు ; అంతే ఆయన ప్రాణాలు అనంతవాయువుల్లో కలిసి పోయాయి.

అది 1900 సంవత్సరం. శార్వరి, ఉత్తరాయణ పుణ్యకాలం, ముక్కోటి ఏకాదశి. అది ఆ జనభుక్తి ప్రదాత కోరుకొన్న ముక్తిదినం. ఆ కలియుగ కర్ణుడు లేడు కాని సీమ అంతటా ఆయన పేరున్నది. ఆయన దానమున్నది. ఆయన దానదధీచి. ఆయన దాన జ్ఞానశిబిచక్రవర్తి. ఆయన దానవీరశూరకర్ణుడు.

★ ★ ★

అనుబంధం - 1 చరిత్రపుటల్లో ...

# కలియుగ కర్ణుడు బుడ్డా వెంగళరెడ్డి

రాయలసీమలో రేనాటి దానకర్ణునిగా పేరుపొందిన శ్రీ బుడ్డా వెంగళరెడ్డి 1822లో జన్మించారు. వీరి స్వస్థలం ఉయ్యాలవాడ. తండ్రి నల్లపరెడ్డి. వీరికి వెంకటమ్మ, నాగమ్మ, వెన్నమ్మ అని ముగ్గురు భార్యలు. నాగమ్మ చనిపోగా చెన్నమ్మను పెళ్ళి చేసుకొన్నారు. ఇరువురికి కూడా సంతానం కలుగలేదు.

వీరి ఇంటిపేరు మొదట మద్దెల ; కాని గొప్పవాడనే అర్థంలో బడా వెంగళరెడ్డి అని పిలుస్తూ పిలుస్తూ బుడ్డా వెంగళరెడ్డిగా మార్చేశారు. జానపదుల నోటపడి మారిన స్థితి ఇది. వీరు మోటాటి రాచరెడ్లే.

బుడ్డా వెంగళరెడ్డి, దానశీలతకు ఆశ్చర్యపోయిన విక్టోరియారాణి స్వర్ణపతకాన్ని బహూకరించింది. అది 1866లో జరిగింది. ఆ సంవత్సరమే కఱవు వచ్చింది. దానినే ధాత కఱవు అంటారు. ఆ రోజుల్లో ప్రజలకు తనకున్న దంతా దానం చేసిన దాన శిబి, దాన దధీచి, దానకర్ణులు ఆయన. మూడు నెలల పాటు ప్రజలకు అన్నవస్త్రాలిచ్చి కన్న తండ్రిలా కాపాడడం మామూలు విషయంకాదు. తన దగ్గరున్న 12 పాతరల ధాన్యాన్ని దానం చేశాడు. మిత్రుల దగ్గర అప్పుచేసి ఆకలిగొన్నవారి ఆకలి దీర్చారు. ఇది తెలిసిన విక్టోరియా రాణి ఆయనకు



స్వర్ణపతకం పంపింది. ఆ పతకానికి ఒక వైపున ఇంగ్లీషులో మరోవైపున తెలుగులో ఈ క్రింది విధంగా వ్రాసి ఉంది.

Presented to Budda Vengala Reddy as a token of the high appreciation of Her Majesty's Government of his munificient liberality of his dispute countrymen in the famine of 1866."

1866వ సంవత్సరములో సంభవించిన క్షామ కాలమందు నిరాధారముగా వుండిన తన స్వదేశస్థుల పట్ల జరిగించిన వుత్కృష్ట మయిన ఔదార్యమునకు గాను హర్‌మెజస్టీ రాణిగారి వల్ల చేయబడిన శ్రేష్ఠమయిన నాణ్యతకు ఆనవాలుగా బుడ్డా వెంగళరెడ్డి గారికి బహుమానము యివ్వబడినది."

బుడ్డా వెంగళరెడ్డి చేసిన దానములు జనవ్యవహారంలో ప్రచారం పొందడమే కాక చరిత్ర పుటల్లోకి ఎక్కాయి.

1. ఒక బ్రాహ్మణుడు ఇంటికి వచ్చి మజ్జిగ అడిగాడు. భార్య చెన్నమ్మ లేవడానికి బద్ధకించి 'మజ్జిగలేదు పొండి'! అన్నది. వెంగళరెడ్డి అతనిని పిలిచి అన్నం పెట్టించి, ఆవు నిచ్చి సాగ నంపాడు.

2. ఫకీరు స్త్రీకి పట్టుచీర దానం చేశాడు. అయితే తన పట్టుచీర భర్త అలా దానం చేయడం నచ్చని రెడ్డి భార్య, వెనుక గుమ్మం దగ్గర ఆమెను ఆపి, ఓ నూలు చీర ఇచ్చి తన పట్టుచీర

తెచ్చుకొంది. ఇది తెలుసుకొన్న దానకర్ణుడు శ్రీరెడ్డి ఆమెకు కొత్తపట్టుచీర నేయించి ఇచ్చి, అన్నంపెట్టి సాదరంగా సాగనంపాడు.

3. రెడ్డి దానశీలతకు విక్టోరియా రాణే మంత్రముగ్ధ అయింది.

4. రెడ్డి గారి బలిసిన ఎద్దును కోసి తినాలని కొందరు పశువులకాడి పిల్లలడిగారు. దానికి రెడ్డి దగ్గర పనిచేసే వారు కోపించి తిట్టికొట్టి పంపారు. వెంగళరెడ్డి ఆ పిల్లలందరిని ఇంటికి పిలుచుకొని వచ్చి కడుపు నిండా అన్నం పెట్టి ఎద్దునిచ్చి పంపించారు. అది తెలిసిన పిల్లల తల్లిదండ్రులు ఎద్దును వెనక్కి తెచ్చి పిల్లల తప్పును క్షమించవలసిందని బ్రతిమాలారు.

5. ఒకనాటి రాత్రి ప్రయాణం. విరూపాక్ష దేవుని దర్శనార్థం వెంగళ రెడ్డి బయలుదేరాడు. ఊరు దాటాడో లేదో గొరక దొంగలు చంపుతామని అడ్డం వచ్చారు. మీరు అన్నం తిన్న తర్వాత నన్ను చంపండని, ఆ నలుగురిని ఇంటికి తీసుకొని వచ్చి, కడుపు నిండా అన్నం పెట్టాడు. ఇక వారి ముందు తలవంచి ఇక నన్ను చంపండి అన్నారు. దొంగలు రెడ్డి కాళ్ళపై పడ్డారు. ఇంటి దగ్గర మీ భార్యా పిల్లలు ఎదురు చూస్తుంటారని, దొంగలకు గాడిదమోత బియ్యం మూటలిచ్చి, దారి ఖర్చు లిచ్చి సాగనంపాడు దాత బుడ్డా వెంగళరెడ్డి.



6. ఒక రోజు శ్రీరెడ్డి గుఱ్ఱమెక్కి చెన్నంపల్లె బయలుదేరాడు. రెడ్డిని చంపాలని పగవారు మాటు వేశారు. ఆ పగవారింటనే పనిచేసే మాల యువకుడు ఈ సంగతి రెడ్డి చెవిన వేశాడు. ఆ యువకుణ్ణి తన దగ్గరే పెట్టుకొని అతని పెండ్లిచేసి, మూడు దినములు ఉయ్యాలవాడకు ఆమడ దూరంలో ఉన్న అందరికి అన్నం పెట్టాడు బుడ్డా వెంగళరెడ్డి. భోజనానికి రాకుండా ఎవరన్నా వంట చేసుకొంటే జుర్మానా విధిస్తానని చాటింపు వేశాడట రెడ్డి.

7. జొన్న చేను పండింది. కంకులు ఏరాలి. చొప్ప తనకు వదలి కంకులు కోసుకొని పొమ్మని కూలీలైన మాల మాదిగలను ఆదేశించాడు రెడ్డి. వారదే విధంగా చేశారు. వెంగళరెడ్డి బంధువులు వారిని పట్టుకొని కొట్టారు. చావడిలో బంధించారు. దానికి రెడ్డి ఎంతో విలపించి వారి గాయాలకు మందు పెట్టించి, మూడు నూర్లు చెల్లించి వారిని విడిపించాడు.

8. శ్రీ బుడ్డా వెంగళరెడ్డి ఒక బ్రాహ్మణుని ఇంటిలో జరిగిన వివాహానికి ఆపద్ధర్మంగా బంగారు మొలత్రాడు ఇచ్చారు. వారు తిరిగి ఇవ్వబోగా తీసుకోకుండా వారికే దానమిచ్చారు.

9. ఒక బ్రాహ్మణునికి 10 రూ.లు దానమిచ్చారు. అతడు తనకు 100 రూపాయలు కావాలన్నాడు. నీకు ప్రాప్తి 10 రూపాయలే అన్నాడు రెడ్డి. అతను ససేమిరా కాదన్నాడు. రెండు చేటల్లో బియ్యం పోయించి ఒకదానిలో 10, మరో దానిలో 100 రూపా

యలు బియ్యం క్రింద పెట్టారు. ఆ బ్రాహ్మణున్ని ఏ చేట కావాలో తీసుకొమ్మన్నారు. అతను తీసుకోగా చూస్తే అందులో 10 రూపాయలే వున్నాయి. అదీ శ్రీరెడ్డి దానక్రాంతదర్శనం.

10. ఆయన అనారోగ్యానికి గురైనప్పుడు చూడడానికి వచ్చిన అభిమానులెందరో నెలల కొలది ఉన్నారు. వారందరికి అన్న - వసతి సౌకర్యాలన్నీ ఆనందంగా చేయించేవారు శ్రీరెడ్డి.

11. శ్రీవెంగళరెడ్డి భోజనం చేసేప్పుడు ప్రతిరోజు పదిమందైనా కలిసి భోజనం చేసేవారు.

12. దూరప్రాంతాలనుండి ఓ నలుగురు రైతులు శ్రీ బుడ్డా వెంగళ రెడ్డిని చూడడానికి వచ్చారు. శ్రీరెడ్డి బండిలోని జొన్నలబస్తా నుండి రాలుతున్న ధాన్యం ఏరుతున్నాడు. అంత దానకర్ణుడు ఆ పని చేయడాన్ని వారు నిరసించారు. వారిని తన ఇంటికి భోజనానికి పిలిచి విస్తళ్ళలో వెండిరూపాయలు వడ్డించాడు. మనం తినేవి వెండి రూకలు కావు అన్నాడు శ్రీరెడ్డి. రైతులకు ఆయన ఎంత వదాన్యుడో ఎందుకు వదాన్యుడో అర్థమయింది.

13. కరవు దినాలలో ఇంగ్లీషు వారి సైన్యానికి కూడా అన్నం దొరకని పరిస్థితులేర్పడినపుడు, వారిని ఇంటికి పిలిపించి కడుపునిండా అన్నం పెట్టి ధాన్యమిచ్చి పంపించిన అన్నదాత బుడ్డా వెంగళరెడ్డి.



14. రాత్రిపూట చిత్తాట (సత్యభామ ఆట) ఆడేవారి నీడలను కొరడా దెబ్బలతో హడలగొట్టి, ఈసారి ఆడితే నీడలపైన దెబ్బలు పడవని శరీరాలపైనే కొరడా ఆడుతుందని హెచ్చరించాడు. వెన్న మనస్సంటే ఆయనదే మరి.

15. టీకాలు వేయించుకొనే పిల్లలకు వెంగళరెడ్డి లడ్డూలు పంచి పెట్టేవాడు

16. ఓ బ్రాహ్మణుడు తన కొడుకు ఉపనయనానికి వంద రూపాయలు దానం అందుకొన్నాడు. మళ్ళీ వచ్చి తీసుకొంటానని వెళ్ళిపోయాడు. ఆ బ్రాహ్మణుడు ఓ రోజు గుఱ్ఱంపై ఊరికి వెడుతున్న వెంగళరెడ్డికి తారసపడ్డాడు. అతనికి దానమిచ్చిన వందరూపాయలు ఎద్దుకొమ్ములో పెట్టి చూరులో పెట్టానని అన్నాడు. ఆ తర్వాత బుడ్డా వెంగళరెడ్డి మరణించారు. రెడ్డి చనిపోయిన సంగతి తెలియని బ్రాహ్మణుడు వచ్చి తనదానం సంగతి చెప్పాడు. చనిపోయిన పదిరోజుల తర్వాత కూడా దాన మిచ్చిన మహాదాత బుడ్డా వెంగళరెడ్డి.

ఇటువంటి సంఘటనలు మరో వంద ప్రచారంలో ఉన్నాయి. అవన్నీ జానపదుల కథల్లో ఉండవచ్చు. కానీ చరిత్ర పుటల్లోకి ఎక్కిన అంశాలే ఇవన్నీ. అటువంటి వారే కదా మహానుభావులు - అన్నదాతలు. ఆ అన్నదాత కలియుగ కర్ణుడు బుడ్డా వెంగళరెడ్డి 1900వ సంవత్సరంలో పరమపదించారు.

## అనుబంధం - 2

# జానపదాలలో బుడ్డా వెంగళరెడ్డి

1. ఉత్తరాది ఉయ్యాల వాడలో
ఉన్నది దరమం సూడరయా!
నేటికి బుడ్డా వెంగళరెడ్డీ
దొడ్డ ప్రెబువనీ తెలియరయా!! ॥ఉత్తరాది॥

దొడ్డ ప్రెబువనీ దొరలు మెచ్చగా-ఇడుపున గూర్చోనుండునయా!
ఇడుపున గూర్చో వెంగళరెడ్డీ-ఇక ఇక నగుతా నుండునయా ॥ఇడు॥

అది నారాయణ అనేటి జనులకు - అన్నవస్తరములిచ్చె నయా!
గోయిందా అని పాడే జనులకు - గోవు దానమే సేసెనయా!

॥గోయిందా॥

మాటా సొచ్చెం తెలిసిన ప్రెబువని - మల్లెపూల మాన్పొండునయా!
పున్నెం సేసిన వెంగళరెడ్డికి - పూలపానుపే ఉండునయా!

॥పున్నెం॥

పరాయి దేశం పోయిన రెడ్డికి - పాన్పులేపు దిండుండునయా!
దిండి సుతారం మెండుగ జనులూ - అండబాయకానుండునయా!

॥దిండి॥

జీనీ ఏనీగురాన్ని ఎక్కి - సెన్నపట్టణము సేరెనయా!
సెన్నపట్టణము సిన్ని దొరలనూ - వొంగి సలాములు సేసిరయా!
వొంగి వొంగి సలాములు సేసిరయా ॥సెన్న॥



మూలము తెలిసిన యెంగళరెడ్డి - మూడు లోకములు ఏలెనయా!
ఎండగాసినా మండలానికీ - ఎరిక గలిగిన రెడ్డినయా!! ॥ఎండ॥

పెళ్ళిళ్ళు కాని బీదబాపలకు - పెళ్ళిళ్లు సేపించెనయా!
కళ్లూ కాళ్ళూ లేనివాళ్లకూ - ఎద్దుబళ్ళు తోలించెనయా!! కళ్ళూ

॥ పుటలు॥

డా. తంగిరాల సేకరించి ప్రచురించిన దానిలో కొంతభాగం (రేనాటి సూర్యచంద్రులు)

2. బ్రాహ్మణునికి దానం

ఉత్తరాది ఉయ్యాలవాడలో - ఉన్నది దరమం సూడరయా!
నేటికి బుడ్డా యెంగళరెడ్డీ - దొడ్డ ప్రెబువనీ తెలియరయా!!

॥ఉత్తరాది॥

పరాయిదేశం ఎక్కడనుండియొ - బాపనయ్య ఒకడొచ్చెనయా!
యెంగళరెడ్డీ యింటికి ఎళ్ళీ - మజ్జిగీయమని అడిగెనయా!

॥యెంగళ॥

యెంగళరెడ్డి సిన్నబారియా - సిన్నబారియో సెన్నమతల్లీ
లేవలేకనేసల్లని తల్లీ - లేవు లేవుఅని పలికెనయా!!

॥లేవలేకనే॥

సూస్తతాళమని యెంగళరెడ్డీ - ఇంటిలో పలికి యెళ్ళెనయా!
కాండవమీనా సిబ్బితీసితే - కదలకమజ్జిగ ఉండెనయా!!

॥కాండవ॥

పాడిలేని బ్రతుకేల అంటనీ - రోసగింపులూ సేసెనయా!
పాలు సక్కరా పంచదారలూ - బాపనయ్యకే పంచెనయా!!

||పాలు||

లేవులేవు అని పోసిన మజ్జిగ - దోసమంచుమదినెంచెనయా!
పడ్డను దూడను యెంగళరెడ్డీ - పగ్గమేసి పట్టించెనయా

||అవును||

తల్లిపిల్లనూ వెంగళరెడ్డి - పగ్గమేసి పట్టించెనయా!
నీది కాదిది నాదీకాదూ - ఆ దేవుని సొమ్మని పలికెనయా!!

||నీది||

ఉత్తరాది ఉయ్యాలవాడలో - ఉన్నది దరమం సూడరయా!
నేటికి బుడ్డా యెంగళరెడ్డీ - దొడ్డ ప్రెబువనీ తెలియరయా!

||ఉత్తరాది||

**దానం దరమం గ్యానం తెలిసీ - దరమ రాజువలె ఏలెనయా**
**సచ్చిన బ్రతికిన యెంగళరెడ్డికి - స్వర్గలోకమే ఉన్నదయా**

**పున్నెం సేసిన వెంగళరెడ్డికి - పూలపానుపే ఉండునయా!**
**మాటా సొచ్చం తెలిసిన ప్రెబువని - మల్లెపూల పాన్పేతురయా!!**



## 3. తురక బూబమ్మకు పట్టుచీర - భూమిదానం

పరాయి దేశం నుండి వక్కా - తురక బూవమా వచ్చెనయా!
నాయనా! ఓయి యెంగళరెడ్డీ - ఒక పాత వస్తరమియ్యవయా
కన్నులారనే వెంగళరెడ్డీ - ఇంటిలోనికే సూసెనయా!
వెంగళరెడ్డీ సిన్నబారియకు - పుట్టింటిలో పెట్టిన యట్టి
సీర వొక్కటే ఉండెనయా!
వెంగళరెడ్డీ సిన్న బారియకు - పుట్టింటోరు పెట్టిన యట్టి
సీర వొక్కటే ఉండెనయా!
దండెం మిందా సీరను దీసి - తురక బూవమ్మకిచ్చెగదా
కన్నులారనే యెంగళరెడ్డీ సిన్న బారియా సూసెనయా!
తురకాబూవమ సేతిలో సీరా -సిన్న బారియాగుంజుకొనే!

నేను ఇచ్చినాదరమం ఈమే - తిరుగుబాటునే సేసెననీ
ఎంట ఎంటనే యెంగళరెడ్డీ-
సీరలు నేసే మాలవాన్ని - పిలవంపెనయా!
కండెలు పడుగూ ఎత్తూ మొత్తము - తూచెనయా!
నాయనా! ఓరి మాలవాడా!
తురక బూవమకు సీర ఒక్కటీ నెయ్యమనే!/
ఎంట ఎంటనే యెంగళరెడ్డీ
మిసును మీదనే రెయికలైన కుట్టించెనయా!
వొడీ బియ్యము కొబ్బరి గిన్నెలు
రెండెకరాల భూమి అయినా
తురక బూవమకు పసుపు కుంతుమా కిచ్చెనయా!
పుట్టింటి ఒక బిడ్డ లెక్కనే
ఉచ్చవమ్మ సేవించెనయా!

(రేనాటి సూర్యచంద్రులు ఆధారంగా)

## అనుబంధం - 3

### పద్యాలలో బుడ్డా వెంగళరెడ్డి

1. కలియుగ దాన కర్ణుడన
గానుతికెక్కును, నాంగ్ల రాజ్ఞిచే
గలిత యశస్సువర్ణపత
కంబు బహూకృతి పొందినట్టి, య
య్యలఘు డుదార శీలమహి
తాత్ముడు, వెంగళరెడ్డి గారికిన్,
సులలిత జన్మభూమియగు
చున్, గణనీయత గాంచె మీదటన్.

(పాణ్యం సోదరకవులు, రేనాటి సూర్యచంద్రులు, పు : 20)

2. వదినెన్మనూట నిర్వది రెండు ఏండ్ల
నొదవిన చిత్రభాన్వత్సర జ్యేష్ఠ
మొనరంగ ప్రథమ సంపూర్ణకందాయ
మున శ్రీశు సిత పక్షమున గురువార
మవనిని సౌభాగ్యమను సుయోగమున
నవమి రోహిణి శుభ నక్షత్రమునను



రమణీయమైన కర్కాటకలగ్న
సమయాన యాపగల్ సలలిత వేళ
నాపూర్వకృతమున నాకు సంతాన
మీపట్ల కృప జేసి యీశ్వరుండొసగె
(వెంగళరెడ్డి తండ్రి నల్లపరెడ్డి పురోహితునితో అన్నాడు)
(బంధుమియ్య అముద్రిత ద్విపదకావ్యం,
రేనాటి సూర్యచంద్రులు, పుట : 68.)

### పేదలు వెంగళరెడ్డిని స్తుతించడం

3. బుడ్డ వెంగళరెడ్డి! భూరికలాప!
రెడ్డి దిలీప! స్వర్లేఖ ప్రతాప!
సద్గుణాలంకార! సద్ధర్మ నిరత!
భర్గు పంచాక్షరీ పఠన ప్రవీణ!
దానధురీణ! సత్కరుణా కటాక్ష!
దీన రక్షక! ధర్మదేవతనిలయ!
మిముగొనియాడ నేమియు నేరమయ్య!
మమునుపేక్షింపకమఱియేలవయ్య!
అన్నమో యనుచును నాకటికడలి
మిన్నుమ్రోతలరీతి మిగులంగనార్వ
అన్నంబు లేకను అడరెడు వాని
మన్ననతోఁబ్రోవ మఱికీర్తి గలదు
ఎన్నంగ దానంబు లెన్ని సేసినను
అన్నదానము సేయుటధిక ఫలమ్ము.

(రేనాటి సూర్యచంద్రులు - పు. 322)

యలు బియ్యం క్రింద పెట్టారు. ఆ బ్రాహ్మణున్ని ఏ చేట కావాలో తీసుకొమ్మన్నారు. అతను తీసుకోగా చూస్తే అందులో 10 రూపాయలే వున్నాయి. అదీ శ్రీరెడ్డి దానక్రాంతదర్శనం.

10. ఆయన అనారోగ్యానికి గురైనప్పుడు చూడడానికి వచ్చిన అభిమానులెందరో నెలల కొలది ఉన్నారు. వారందరికి అన్న - వసతి సౌకర్యాలన్నీ ఆనందంగా చేయించేవారు శ్రీరెడ్డి.

11. శ్రీవెంగళరెడ్డి భోజనం చేసేప్పుడు ప్రతిరోజు పదిమందైనా కలిసి భోజనం చేసేవారు.

12. దూరప్రాంతాలనుండి ఓ నలుగురు రైతులు శ్రీ బుడ్డా వెంగళ రెడ్డిని చూడడానికి వచ్చారు. శ్రీరెడ్డి బండిలోని జొన్నలబస్తా నుండి రాలుతున్న ధాన్యం ఏరుతున్నాడు. అంత దానకర్ణుడు ఆ పని చేయడాన్ని వారు నిరసించారు. వారిని తన ఇంటికి భోజనానికి పిలిచి విస్తళ్ళలో వెండిరూపాయలు వడ్డించాడు. మనం తినేవి వెండి రూకలు కావు అన్నాడు శ్రీరెడ్డి. రైతులకు ఆయన ఎంత వదాన్యుడో ఎందుకు వదాన్యుడో అర్థమయింది.

13. కరవు దినాలలో ఇంగ్లీషు వారి సైన్యానికి కూడా అన్నం దొరకని పరిస్థితులేర్పడినపుడు, వారిని ఇంటికి పిలిపించి కడుపునిండా అన్నం పెట్టి ధాన్యమిచ్చి పంపించిన అన్నదాత బుడ్డా వెంగళరెడ్డి.



14. రాత్రిపూట చిత్తాట (సత్యభామ ఆట) ఆడేవారి నీడలను కొరడా దెబ్బలతో హడలగొట్టి, ఈసారి ఆడితే నీడలపైన దెబ్బలు పడవని శరీరాలపైనే కొరడా ఆడుతుందని హెచ్చరించాడు. వెన్న మనస్సంటే ఆయనదే మరి.

15. టీకాలు వేయించుకొనే పిల్లలకు వెంగళరెడ్డి లడ్డూలు పంచి పెట్టేవాడు

16. ఓ బ్రాహ్మణుడు తన కొడుకు ఉపనయనానికి వంద రూపాయలు దానం అందుకొన్నాడు. మళ్ళీ వచ్చి తీసుకొంటానని వెళ్ళిపోయాడు. ఆ బ్రాహ్మణుడు ఓ రోజు గుఱ్ఱంపై ఊరికి వెడుతున్న వెంగళరెడ్డికి తారసపడ్డాడు. అతనికి దానమిచ్చిన వందరూపాయలు ఎద్దుకొమ్ములో పెట్టి చూరులో పెట్టానని అన్నాడు. ఆ తర్వాత బుడ్డా వెంగళరెడ్డి మరణించారు. రెడ్డి చనిపోయిన సంగతి తెలియని బ్రాహ్మణుడు వచ్చి తనదానం సంగతి చెప్పాడు. చనిపోయిన పదిరోజుల తర్వాత కూడా దాన మిచ్చిన మహాదాత బుడ్డా వెంగళరెడ్డి.

ఇటువంటి సంఘటనలు మరో వంద ప్రచారంలో ఉన్నాయి. అవన్నీ జానపదుల కథల్లో ఉండవచ్చు. కానీ చరిత్ర పుటల్లోకి ఎక్కిన అంశాలే ఇవన్నీ. అటువంటి వారే కదా మహానుభావులు - అన్నదాతలు. ఆ అన్నదాత కలియుగ కర్ణుడు బుడ్డా వెంగళరెడ్డి 1900వ సంవత్సరంలో పరమపదించారు.

## అనుబంధం - 2

# జానపదాలలో బుడ్డా వెంగళరెడ్డి

1. ఉత్తరాది ఉయ్యాల వాడలో
ఉన్నది దరమం సూడరయా!
నేటికి బుడ్డా వెంగళరెడ్డీ
దొడ్డ ప్రెబువనీ తెలియరయా!! ॥ఉత్తరాది॥

దొడ్డ ప్రెబువనీ దొరలు మెచ్చగా-ఇడుపున గూర్చోనుండునయా!
ఇడుపున గూర్చో వెంగళరెడ్డీ-ఇక ఇక నగుతా నుండునయా ॥ఇడు॥

అది నారాయణ అనేటి జనులకు - అన్నవస్త్రములిచ్చె నయా!
గోయిందా అని పాడే జనులకు - గోవు దానమే సేసెనయా!

॥గోయిందా॥

మాటా సొచ్చెం తెలిసిన ప్రెబువని - మల్లెపూల మాన్పుండునయా!
పున్నెం సేసిన వెంగళరెడ్డికి - పూలపానుపే ఉండునయా!

॥పున్నెం॥

పరాయి దేశం పోయిన రెడ్డికి - పాన్పులేపు దిండుండునయా!
దిండి సుతారం మెండుగ జనులూ - అండబాయకానుండునయా!

॥దిండి॥

జీనీ ఏనీగురాన్ని ఎక్కి - సెన్నపట్టణము సేరెనయా!
సెన్నపట్టణము సిన్ని దొరలనూ - వొంగి సలాములు సేసిరయా!
వొంగి వొంగి సలాములు సేసిరయా ॥సెన్న॥



మూలము తెలిసిన యెంగళరెడ్డి - మూడు లోకములు ఏలెనయా!
ఎండగాసినా మండలానికీ - ఎరిక గలిగిన రెడ్డినయా!! ॥ఎండ॥
పెళ్ళిళ్ళు కాని బీదబాపలకు - పెళ్ళిళ్లు సేపించెనయా!
కళ్లూ కాళ్ళూ లేనివాళ్లకూ - ఎద్దుబళ్ళు తోలించెనయా!! కళ్ళూ

॥పుటలు॥

డా. తంగిరాల సేకరించి ప్రచురించిన దానిలో కొంతభాగం (రేనాటి సూర్యచంద్రులు)

## 2. బ్రాహ్మణునికి దానం

ఉత్తరాది ఉయ్యాలవాడలో - ఉన్నది దరమం సూడరయా!
నేటికి బుడ్డా యెంగళరెడ్డీ - దొడ్డ ప్రెబువనీ తెలియరయా!!

॥ఉత్తరాది॥

పరాయిదేశం ఎక్కడనుండియొ - బాపనయ్య ఒకడొచ్చెనయా!
యెంగళరెడ్డీ యింటికి ఎళ్ళీ - మజ్జిగీయమని అడిగెనయా!

॥యెంగళ॥

యెంగళరెడ్డి సిన్నబారియా - సిన్నబారియో సెన్నమతల్లీ
లేవలేకనేసల్లని తల్లీ - లేవు లేవుఅని పలికెనయా!!

॥లేవలేకనే॥

సూస్తతాళమని యెంగళరెడ్డీ - ఇంటిలో పలికి యెళ్ళెనయా!
కాండవమైనా సిబ్బితీసితే - కదలకమజ్జిగ ఉండెనయా!!

॥కాండవ॥

పాడిలేని బ్రతుకేల అంటనీ - రోసగింపులూ సేసెనయా!
పాలు సక్కరా పంచదారలూ - బాపనయ్యకే పంచెనయా!!

||పాలు||

లేవులేవు అని పోసిన మజ్జిగ - దోసమంచుమదినెంచెనయా!
పడ్డను దూడను యెంగళరెడ్డీ - పగ్గమేసి పట్టించెనయా

||అవును||

తల్లిపిల్లనూ వెంగళరెడ్డి - పగ్గమేసి పట్టించెనయా!
నీది కాదిది నాదీకాదూ - ఆ దేవుని సొమ్మని పలికెనయా!!

||నీది||

ఉత్తరాది ఉయ్యాలవాడలో - ఉన్నది దరమం సూడరయా!
నేటికి బుడ్డా యెంగళరెడ్డీ - దొడ్డ ప్రెబువనీ తెలియరయా!

||ఉత్తరాది||

**దానం దరమం గ్యానం తెలిసీ - దరమ రాజువలె ఏలెనయా**
**సచ్చిన బ్రతికిన యెంగళరెడ్డికి - స్వర్గలోకమే ఉన్నదయా**

**పున్నెం సేసిన వెంగళరెడ్డికి - పూలపానుపే ఉండునయా!**
**మాటా సొచ్చం తెలిసిన ప్రెబువని - మల్లెపూల పాన్పేతురయా!!**



## 3. తురక బూబమ్మకు పట్టుచీర - భూమిదానం

పరాయి దేశం నుండి వక్కా - తురక బూవమా వచ్చెనయా!
నాయనా! ఓయి యెంగళరెడ్డీ - ఒక పాత వస్త్రమియ్యవయా
కన్నులారనే వెంగళరెడ్డీ - ఇంటిలోనికే సూసెనయా!
వెంగళరెడ్డీ సిన్నబారియకు - పుట్టింటిలో పెట్టిన యట్టి
సీర వొక్కటే ఉండెనయా!
వెంగళరెడ్డీ సిన్న బారియకు - పుట్టింటోరు పెట్టిన యట్టి
సీర వొక్కటే ఉండెనయా!
దండెం మిందా సీరను దీసి - తురక బూవమ్మకిచ్చెగదా
కన్నులారనే యెంగళరెడ్డీ సిన్న బారియా సూసెనయా!
తురకాబూవమ సేతిలో సీరా -సిన్న బారియాగుంజుకొనే!

నేను ఇచ్చినాదరమం ఈమే - తిరుగుబాటునే సేసెననీ
ఎంట ఎంటనే యెంగళరెడ్డీ-
సీరలు నేసే మాలవాన్ని - పిలవంపెనయా!
కండెలు పడుగూ ఎత్తూ మొత్తము - తూచెనయా!
నాయనా! ఓరి మాలవాడా!
తురక బూవమకు సీర ఒక్కటీ నెయ్యమనే!/
ఎంట ఎంటనే యెంగళరెడ్డీ
మిసును మీదనే రెయికలైన కుట్టించెనయా!
వొడీ బియ్యము కొబ్బరి గిన్నెలు
రెండెకరాల భూమి అయినా
తురక బూవమకు పసుపు కుంకుమా కిచ్చెనయా!
పుట్టింటి ఒక బిడ్డ లెక్కనే
ఉచ్చవమ్ము సేవించెనయా!

(రేనాటి సూర్యచంద్రులు ఆధారంగా)

## అనుబంధం - 3

### పద్యాలలో బుడ్డా వెంగళరెడ్డి

1. కలియుగ దాన కర్ణుడన
గానుతికెక్కును, నాంగ్ల రాజ్ఞిచే
గలిత యశస్సువర్ణపత
కంబు బహూకృతి పొందినట్టి, య
య్యలఘు డుదార శీలమహి
తాత్ముడు, వెంగళరెడ్డి గారికిన్,
సులలిత జన్మభూమియగు
చున్, గణనీయత గాంచె మీదటన్.

(పాణ్యం సోదరకవులు, రేనాటి సూర్యచంద్రులు, పు : 20)

2. పదినెన్మనూట నిర్వది రెండు ఏండ్ల
నొదవిన చిత్రభాన్వత్సర జ్యేష్ఠ
మొనరంగ ప్రథమ సంపూర్ణకందాయ
మున శ్రీశు సిత పక్షమున గురువార
మవనిని సౌభాగ్యమను సుయోగమున
నవమి రోహిణి శుభ నక్షత్రమునను



రమణీయమైన కర్కాటకలగ్న
సమయాన యాపగల్ సలలిత వేళ
నాపూర్వకృతమున నాకు సంతాన
మీపట్ల కృప జేసె యీశ్వరుండొసగె
(వెంగళరెడ్డి తండ్రి నల్లపరెడ్డి పురోహితునితో అన్నాడు)
(బంధుమియ్య అముద్రిత ద్విపదకావ్యం,
రేనాటి సూర్యచంద్రులు, పుట : 68.)

### పేదలు వెంగళరెడ్డిని స్తుతించడం

3. బుడ్డ వెంగళరెడ్డి! భూరికలాప!
రెడ్డి దిలీప! స్వర్లేఖ ప్రతాప!
సద్గుణాలంకార! సద్ధర్మ నిరత!
భర్గు పంచాక్షరీ పఠన ప్రవీణ!
దానధురీణ! సత్కరుణా కటాక్ష!
దీన రక్షక! ధర్మదేవతనిలయ!
మిముగొనియాడ నేమియు నేరమయ్య!
మమునుపేక్షింపకమఱియేలవయ్య!
అన్నమో యనుచును నాకటికడలి
మిన్నుమ్రోతలరీతి మిగులంగనార్వ
అన్నంబు లేకను అడరెడు వాని
మన్ననతోబ్రోవ మఱికీర్తి గలదు
ఎన్నంగ దానంబు లెన్ని సేసినను
అన్నదానము సేయుటధిక ఫలమ్ము.

(రేనాటి సూర్యచంద్రులు - పు. 322)

## 4. మహాదాత బుడ్డా వెంగళరెడ్డి

* మునిగెను కాలగర్భమున మూర్తి వహించిన ధర్మతేజమే!
మునిగిరి శోక వార్ధినటు ముగ్గురు తల్లులు నొక్కసారిగా!
మునిగిరి లోకులందఱును పుట్టెడు దుఃఖము నందు, సృష్టియే
మునిగెను ఖేద మందనగ మోడులుగా గనుపట్టె భూజముల్.

* పరుల క్షుద్బాధ నడగించు వ్రతము పూని
మనిన వృక్షమ్ము నిరతమ్ము మధురఫలము
లొసగి తటుకున నాకుల నూడ్చివేసి
యెండిపోయెను యాచకు లేడ్చునట్లు.

* పసిమిని గుల్కు వృక్షములు బాధను వ్యక్తము జేసె, నాకులన్
వెసనటు రాల్చి మోడులయి, భీతివడంకెను ప్రాణులన్నియున్
రసికత వీడి తీవ్ర శిశిరంబునబోలె, నుదార తేజమే
మిసమిసలాడుచున్ వెలిగి మృత్యువు నందగ నాక్షణంబునన్.

(మహాదాతకావ్యం :
శ్రీ అందలం కృష్ణమూర్తి)



శుభమ్